వంశీస్వరాలు

1,2 భాగములు





ప్రథమ ముద్రణ .

ప్రమాధినామ సంవత్సరం - 1999 జూన్

ప్రతులు · 1000

మూల్యము : రు. 35-00



ప్రతులకు - మురళీ ప్రచురణ.

యన్. బాబూరావు
రామనగర్ 2వ లైను
అవ్వమ్మబావి, బళ్ళారి - 583 103.
☎ 72845

వెంట్రప్రగడ సుదర్శనశర్మ (ఆర్.టి.సి.)
రామస్వామిపేట న్యూ కాలని,
తెనాలి - 522 201.

ముద్రణ :
వాసవి ప్రింటర్స్
గాంధీచౌక్, తెనాలి.
☎ 28099

డి.టి.పి. :
సాయిరాం గ్రాఫిక్స్
మెయిన్‌రోడ్, తెనాలి.

# అంకితము



ఈ సంకీర్తనా గ్రంథమును
ఉత్తమ సాహిత్యముగ గుర్తించి
మతసంబంధ గ్రంథముద్రణకు అందించు
ఆర్థిక సహాయము తిరుమల
తిరుపతి దేవస్థానమువారు అందించినారు.

# రసస్పందన

స్వామి సర్వేశ్వరానంద
బొమ్మకృపల్లి

రమ్యము. రమ్యాతిరమ్యము. రమణీయమైన వచోవిభవము. మధుమధురరవళిని మురళిలో మ్రోయించి జగతిని పులకితంచేసే వేణుమాధవుని పదవిన్యాసము నర్తనకౌత్సుకము స్వరతరంగభంగిమలు మహోత్తుంగతరంగాలై యమునానదీ పులినతటియందలి శరత్కాల పండువెన్నెలరాత్రిని పరమానందంగా పరవశింపజేసిన "వంశీస్వరాలు" నిజజీవిత మకరందాలుగ రసస్ఫూరిత చిద్రూపవృత్తిచే రచించిన నీ కృతిగేయములు మనస్సుకు మత్తుగొల్పుతూ మరిమరి ఆపాట (కృతి) నీ మాటల్లో ఊటలు వూరించు రసరాగతాలిమలో తాళనృత్యలయల సంతరించి సర్వుల ఆనందకరము చేయాలని ఆశించు మీ

స్వామి సర్వేశ్వరానంద

శ్రీ రాజరాజేశ్వరిదేవస్థానం
బొమ్మకృపల్లి
అనంతపురం జిల్లా

# వంశీ మాధుర్యం

దేవకీవసుదేవుల గర్భ అమృతరసాలఫలం, మధురాతి మధుర దివ్య సుందర రూపం, పురుషానందకరమోహన సురూపం, గోగోపగోపీకమలనయనానందకర హాసం, నందయశోదాప్రేమామృతమధురమందారం భక్తమునిజనగణహృదయ సందీపితదీపం, భారతభారతీప్రతిష్ఠావివర్ధితతేజం, పరమార్ధతత్త్వ పరివ్యాపితకర్మపరిపోషితనామం, సమస్త జీవమనః పద్మ భాసితగోలోకారవిందం, రాధామానసవాసనా విలసితమాధవం, శ్రీకృష్ణాభిరామం నామం ఎంత మధురం

ఆ రూపమాధుర్యమును గూర్చి ఎంత చదివినా, ఎంత వినినా, ఎంత పాడినా, ఎంత ఆరాధించినా, ఎంత వ్రాసినా, నిరంతరధ్యాననిమగ్నమయినా అతని కోసం విలపించినా, ఆక్రోశించినా పారవశ్యాన్ని పొందినా తృప్తి కలుగదు.

వ్యాస శుకశౌనకాది తత్త్వజ్ఞానులు నిరంతరం తపోనిష్ఠాగరిష్ఠులయి నందనందనుని యశోదాకృష్ణుని సన్నిధానంలో గడిపినా శాశ్వతానందం లభించువరకు సనాతనుని విడువలేదు. క్షణమైనను మరువలేదు

ఆ శాశ్వత సత్యాన్ని ఆ అనంతధర్మాన్ని చేరుకొనుటకోసమే ఈ ఆవేదనాంతర్మధిత యమునాతరంగకధిత రాధాహృదయనర్తిత వంశీస్వరాలు.

పుణ్యభూమి అయిన భరతభూమి పదునాలుగు భువనాలకు ఆరాధ్యం. ఎందుకంటే పరమాత్మ ఇచ్చట ప్రతియుగంలో ధర్మరక్షణార్థం జన్మించాడు. పరిపూర్ణ జీవితఫల మయిన పరమార్ధాన్ని అన్ని లోకాలకు అందించాడు. అందుకే.

ఆధ్యాత్మికసారం విశ్వవ్యాప్తం గావించిన పుణ్యపురుషులను కన్న పవిత్రదేశం భారతదేశం ఎందరో మహాపురుషులు ప్రభవించి ధర్మరక్షణ కావించిన కాశ్యపీఖండం (ఇది) భరతఖండం

ద్వాపరంలో జన్మించిన నందకిశోరుడు కాదు ఆనందకిశోరుడు విశ్వమును శాంతిమయం ధర్మమయం చేశాడు. మురళీలోలుడు విహరించిన భరతభూమి పావన బృందావనమై వేదాంతశాస్త్రమునకే పుణ్యస్థల మయింది.

బృందావనంలో గోపికలు గోపాలురు గోవులు వృక్షములు ఒకటేమిటి అణువణువు గోవిందనామస్మరణతో పులకించి సర్వం బాలకృష్ణుని రూపంగా పరిణామం చెందింది. మధుర ప్రేమామృతంతో గోపికల హృదయాలను రసమయం చేసిన బాల

గోపాలుని మధురస్మృతులతో బృందావనం రససించితమైంది. బాల్యక్రీడలతో రాగరంజితమై వెలిగింది.

నందనందనుని దివ్యానురాగంతో బృందావనంలో అణువణువు సత్యసనాతన చైతన్య కాంతిపుంజ మయి కమనీయ మృదుమధురహృదయాలను కదలించి పాషాణ హృదయులను గూడ కరగించి వేసింది. అక్కడ రాళ్ళు సంభాషిస్తాయి. పాదపములు కథలు చెబుతాయి. మందమారుతం సంగీతం పాడుతుంది. యమునాతరంగాలు మృదంగధ్వానాలు వినిపిస్తాయి. యమునాతీరనికుంజాలు మురళీమోహనుని వంశీగాన గంధసుగంధాలు గుబాళిస్తాయి.

అట్టి పావన పుణ్యప్రదేశంలో రాధ కృష్ణుని నిరీక్షణలో సర్వాన్ని మఱచి శ్రీకృష్ణ సేవకై పరితపిస్తూంటుంది. అటువంటి పుణ్య ప్రదేశం బృందావనం అంటే తులసీవనం కృష్ణునకు అత్యంతప్రీతిపాత్రం. అచ్చట ఈనాటికి కూడ కృష్ణస్వామి వంశీస్వరాలు అనురాగపూర్ణమయి ప్రశాంతసమయాల్లో వినిపిస్తూంటాయని అచ్చటి పరమభక్త శిఖామణుల వచనామృతం

ఆ మురళీగానం అమరసుధాసారాన్ని మించిన మాధురీగుణ భూయిష్ఠం. అది సర్వకాలములయందు ప్రవహించు గంగాప్రవాహం. అది భక్తులకు మాత్రం బృందలో వినిపిస్తుంది అది విన్న ప్రతిమానవహృదయం బృందావనం అవుతుంది సప్తస్వర సంభూతం అయిన ఆ దివ్యనాదం ఆనందలోకంలో నిలుపుతుంది. అదే ప్రణవంతో కూడిన ప్రణయనాదమై ప్రశాంతిధామంలో చేరుస్తుంది.

ప్రణవధ్వాన మనే వంశీరావాలు వినగానే అరిషడ్వర్గాలనే మయూరాలు తమతమ పనులు వదలివేస్తాయి. మమతాభిమానాలనే గోవులు అనిమేషస్థితిని పొందుతాయి చంచలమైన మనస్సనే కోతి నిశ్చలత్వాన్ని పొందుతుంది. ఆశలనే వత్సములు దుగ్ధమను ఇంద్రియసుఖాలకు దూరమవుతాయి కామవాసనలనే యమునాతరంగాలు చలన రహితాలై పోతాయి. ద్వంద్వాలకు అతీతంగా వాసనల జయించి అరివర్గాలకు దూరమై స్వపరములను ఛేదించి పురుషార్థములను అధిగమించి అహంకారం అను ఓడను పగులగొట్టి ఆత్మజ్ఞానమును పొంది పరమాత్మకు సమీపమై ఆనందానుభూతితో స్వస్థానము చేరుకొని నిర్మలానందదుగ్ధపారావారంలో "అహంబ్రహ్మాస్మి" అనుకొంటారు.

అజ్ఞానం నశించి కర్మబంధాలు విడిపోయి ఆత్మ అనే గోపిక పరమాత్మ అనే బాలముకుందునితో హృదయ బృందావనంలో వంశీస్వరాలు పానం చేస్తూ లయించి

పోతుంది. ఆ స్థితిని ఆ తాదాత్మ్యమును పొందటానికి భూమికి వచ్చిన రాధామాయి మాయాధీనం కాక కృష్ణస్వామిని కలియుటకు చేయు ప్రయత్నం, కృష్ణస్వామిని సేవించుటకు చేయు నిరీక్షణ, నందనందనుని కాంచ పడు తాపత్రయం, నవనీతచోరుని ముఖారవిందసందర్శనకై పొందు తపన, ఆధ్యాత్మిక పురుషునకై కావించు అన్వేషణ ఈ గేయములలో (కూర్చబడ్డాయి) తొణికిసలాడాయి.

జ్యోతులకు పరంజ్యోతి యగు పీతాంబరుని కోసం ఆవేదనతో రాధ ఆడుతూ పాడుతూ వగతో ఎదురుతెన్నులు చూస్తూంది. యశోదానందనునికోసం, దేవకీగర్భ సంజాత రసస్వరూపుని కోసం, జ్ఞానులలోప్రధమగణ్యుడగు ఆ అనంతునికోసం రాధ రసరంజితంగా గానం చేస్తూ అంటుంది "దారిచూపరా!" కృతిలో.

"ఓ కన్న! నీకన్న నాకెన్న లేరురా?
రాకున్న అన్నన్న శ్వాసన్న తీయరా
లేకున్న మీయమ్మ యశోదకే చెప్పనా!
వినకున్న కన్నమ్మ దేవకికే తెల్పనా?"

అని దీనాతిదీనంగా విలపిస్తూంటే హృదయంతో చూచిన వారికి ఆవేదన కలుగకపోదు. రసజ్ఞులు రసానందంతో పరమార్థానుభూతిలో మునిగితే, సామాన్యులు సాహిత్యానుభూతి పొందితే, జ్ఞానులు రసస్ఫూరిత చిద్రూపవృత్తిలో సంలగ్నులౌతారు

నల్లనయ్య అనే కృతిలో "ఏది బంధము ఏది మోక్షము? ఏది శూన్యము ఏది పూర్ణము?" తెలియజేయవలసిందంటూ పురుషోత్తముని నిలువరించే ప్రశ్నలు అడుగుతూ వుంది.

'అధరసుధ'లో

"భక్త సులభుని భజన లోన
ముక్తి పధమున మునుగ వలెను
మనిసి బ్రతుకు మాయ మయిన
అనద నగుచు అడల జాల" అని

'శాశ్వత నిద్ర'లో

"పాపపుణ్యములు తెలియలేనురా
చీకటి తెరలను చెనకి కావరా" అంటూ

'వెలుగునీది' లో

"జీవుల యందలి జీవము నీవు

జగతిని బ్రోచే స్వామివి నీవు" అని

కృష్ణపరమాత్మ సర్వవ్యాపకత్వాన్ని తెలియజేస్తుంది రాధ.

'లల్లరా' అనే పాటలో

"నాదబ్రహ్మము వేదబ్రహ్మము

నీవు నీవని నిలచి మ్రొక్కగ" అని అడుగడుగునా ఈ ప్రథమ భాగములోని నలుబది అయిదు పాటల్లో శోకిస్తుంది ప్రార్థిస్తుంది అనునయిస్తుంది

కవి హృదయం రాధయిందో, రాధ కవిలో ప్రవేశించిందో తెలియదు

రాగం కృష్ణుడయిన రావం రాధ అయింది ప్రేమ రాధ అయితే సర్వవ్యాపకుడు దేవకీనందను డయ్యాడు.

'వంశీస్వరాలు' ప్రథమభాగం చూచి పాటలను విని ఆనందానుభూతితో స్పందించి 'రసస్పందన' అను అమృతమయ మగు రసరంజిత వాక్యములు ఆత్మానందంతో రచించి యిచ్చిన శ్రీశ్రీశ్రీ స్వామి సర్వేశ్వరానందగారికి నమస్సుమములు అందించుచున్నాను

ఈ కృతికన్యను భావచిత్రాలంకారములతో అలంకరించిన చిత్రకళావిశారద, బ్ర॥వే॥ పణితపు నాగేశ్వరరావుగారు వారి తనయ చి॥ల॥సౌ॥ గుంటముక్కల విజయగారలకు హృదయపూర్వక నమస్సులు

ఈ గ్రంథమును చక్కగా ముద్రించిన వాసవి ప్రింటర్స్, గాంధీచౌక్, తెనాలి, ప్రొ॥ లయన్ శ్రీ బి. సాంబశివరావుగారికి అభినందనలు

నాకు ఈ కార్యక్రమంలో అన్నివిధముల సహాయ సహకారములందించుచున్న నా సోదరి, బావగారలయిన చి॥ల॥సౌ॥ వెంట్రప్రెగడ రాజ్యలక్ష్మి, సుదర్శన శర్మలకు కృతజ్ఞతలు అందించుచున్నాను.

ప్రమాధినామ సంవత్సర వైశాఖము

దీ. 31-5-1999

రచయిత

**నడకుదురు రాధాకృష్ణకుమారి**

# ధరావాసం

యదువంశోద్భవ! నందనందన! రాధాహృదయనివాసా! దేవగణపూజిత పాదపద్మ! గోపాలిత హృదయ! కృష్ణా!

నీ మమతానురాగము చిఱునవ్వులు నీ మృదుమధుర వచస్సులు అనితర సాధ్యములు. నీ చూపుల సొగసులు మురళీరాగాలు మరువకున్నాను నీవలన దుఃఖము శమించింది. నీ స్నేహవాత్సల్యములను తలంచుచు ఈలోకమున ఎంతకాలము జీవించ వలయును అభాగ్యనగు నాకు ముక్తి యెప్పుడు? అంటూంది రాధమ్మ

పల్లవి॥ నందకిశోరా! యదునందనా!
వందితరాధా! హృదిస్పందనా!

అను॥ పూజిత సురగణ కృతవందనా!
రాజితగోగణ హితకుందనా! ॥నంద॥

చరణం॥ నవ్వుల పువ్వులు మోమున
చిరునవ్వుల జల్లులు లోకాన
విరిసిన వలపులు డెందాన
తలవని తలపులు భావాన ॥నంద॥
పెదవుల బాసలు మరువమురా
మనసున మమతలు నిత్యమురా
కలువల కన్నులు కాంచనురా
చెరగని ముద్రలు సత్యమురా ॥నంద॥
వేణువు పలికిన మృదునాదాలు
మదిలో వీచెను చల్లని గాలులు
ఎదలో నిండెను జాజుల పూజలు
వేదన మిగిలెను గుండెల లోతుల . ॥నంద॥
ఎన్నాళ్ళీ తీయని స్నేహం
ఎన్నేళ్ళీ ధరలో వాసం ॥నంద॥

# అభేదము

దేవకీగర్భ జననం. యశోదా భవనవర్ధనం. పూతన హననం బృందావన విహారం చేసినవాడవు

గోకుల మందలి గోపికలను రాసక్రీడలో తన్మయుల గావించి కాళియుని గర్వ మణచిన కన్నయ్య! చద్దిముద్దలు మట్టిబెడ్డలు తినిన నిన్ను వెన్నదొంగ వన్న నమ్మ జాలను నీ బాల్యక్రీడల వర్ణింపలేను నిన్ను కొలువ అగుపించవు నిన్ను మఱచుట సాధ్యముగాదు

నన్ను నీలో లయము చేసికొన్న బాధలు లేనిదాన నగుదును అని విలపిస్తూంది రాధ

పల్లవి॥ దేవకిపుత్ర యశోదనేత్ర!
బృందావనకుంజ చిత్రచరిత్ర!

అను॥ పూతన నెఱిగిన పరమపవిత్ర!
మాయను నణచిన గుణలవిత్ర! ॥దేవ॥

చరణం॥ దేవకి కంట యశోద యింట
విరిసితి వంట లోకము పంట
గోకుల మంట నివాస ముంట
మురిసితి వంట వేణువు వెంట ॥దేవ॥
గోపిక లంతా రాసము లోన
సర్వము మఱచి నాట్యము సేయ
కాళియు దలసి గర్వము విడువ
జ్ఞానము ప్రాణము తెలియ జేసిన ॥దేవ॥
బాల్యక్రీడల నేమని కొల్తుర
వెన్నదొంగ వన నమ్మ లేనుర
చద్ది ముద్దలు మట్టిగడ్డలు
సమముగ మ్రింగి విశ్వము చూపిన ॥దేవ॥
కొలువ లేనుర
మరువ జాలర
నీలో లయమై మురియ నీయర. ॥దేవ॥

# మంగళధాముడు

సారసనేత్ర! సత్యజ్ఞాత! శ్రీప్రదాత! కోమలశరీర! పదములకు లభించవు. మర్మములు తెలుపవు.

ధర్మస్థాపకుడవైన నీవు కర్మబోధతో పుణ్యభూమి భరతభూమికి జీవము పోసిన మోహనరూపుడవు నమ్మిన వారిని మోసము చేయని కరుణారూపమవు కామిత బంధుడవు. నిన్ను సేవించు భక్తులపాలికి మృదుహృదయుడవు.

జగతిని సంస్కృతిని రక్షసేయు లీలా పురుషుడవు వేద పురుషుడవు. రాగరూపుడవు నీ వంది రాధ.

పల్లవి॥ పదముల కందని పావన చరితుడు
మాధవదేవుడు మర్మము చెప్పడు

అను॥ సత్యము తెలిసిన సారసనేత్రుడు
సిరులను నిచ్చెడి కోమల గాత్రుడు ॥పదము॥

చరణం॥ ధర్మము నిలిపిన కర్మము తెలిపిన
లోకము లేలిన రాగము పంచిన
భారతభూమికి జీవ మొసంగిన
మోహన రూపుడు మాధవుడు. ॥పదము॥

నమ్మిన వారిని వంచన చేయని
కరుణాసింధువు కామితబంధువు
సేవిత సేవక పేశల హృదయుడు
మంగళధాముడు మాధవుడు ॥పదము॥

మయూర పింఛుడు మానితవేషుడు
సంస్కృతిపోషిత సరసిజ నేత్రుడు
జగతిని బ్రోచెడు లీలాపురుషుడు
తగవుల దీర్చెడు మాధవుడు. ॥పదము॥

వేద పురుషుడు
రాగ పురుషుడు
అతడే అతడే. ॥పదము॥

# జన్మదుఃఖము

కృష్ణా! దుఃఖములో మునుగు మని మానవజన్మ నిచ్చితివా? పూర్వపు మధురస్మృతు లన్నియు చెరలో నుంచి తప్పటడుగులు వేయించుచున్నావా?.

ఏ బంధములు లేని నన్ను ఈ లోకమునకు త్రోసి బంధింప జూచుచున్నావు ఎండమావులలో నీరుండదని ఎడారిలో జలముండ దని తెలియక నీ మాటల మాయలో బడి మోసపోతిని కపట నాటకములు బంధములకు హేతువు లని జీవిత మంతయు చింతించు మని కాలుని ముందు బాధలు తెలుపుటకు, కృష్ణుని పొంద లేని వారల చూపుటకు నన్ను కొని వచ్చితివి

కృష్ణుని కాదను నడత జన్మజన్మల నరకమని తెల్పితివి

పల్లవి॥ ఖేదజలధి క్రుంకు లిడు మని
మానవ జన్మము నిచ్చితివా?

అను॥ మధురస్మృతులు కారను నంచును
బుడిబుడి నడకలు నేర్పితివా? ॥ఖేద॥

చరణం॥ బంధము లన్నియు త్రెంచిన నాకు
అనుబంధము లెందుకు కూర్చితి?
ఇహముపరము నీవే నీ వని
తలచిన నన్ను ధరలో ద్రోసితి ॥ఖేద॥

ఎండమావిలో జల ముండ దని
ఎడారిలో నీరుండ దని
ఎరుగక తలపక నడచితి
మర్మపుమాటలు నమ్మితి ॥ఖేద॥

కపటపు నటనము బంధ మట
జీవిత మంతయు చింత లట
కాలుని ముందట కందు నట
మాధవు జేరుట జరుగ దట ॥ఖేద॥

కృష్ణుని కాదను నడక లట
జనమజనమల నరక మట ॥ఖేద॥

# అమ్మ రమ్మంది

అమ్మ నిన్ను రమ్మందని యమునాతరంగం చిరుగాలి చల్లగ చెప్పింది. గున్నమావి చిగుళ్ళు మెక్కిన కోయిల రాగవీణ మీద కళ్యాణిరాగం ఆలపించుచు చెప్పింది అమ్మ నిన్ను రమ్మందని

గోపికలు నందకిశోరుని చుట్టుముట్టి వనమయూరములై మేఘరంజనీ రాగంలో చెప్పాయి అమ్మ నిను రమ్మందని యమునా తీరంలో పొదరిళ్ళలో కూర్చున్న శుకములు యోగముద్రలో అంతయు మఱచి జ్ఞానముద్రలో వెలిగి పొమ్మని పలికాయి

దేవకీసుతుని ఆన యేమో? పూర్వజన్మ పుణ్యమేమో? అనుకొంది మృదుమధుర మంజుల మనోహర హృదయ రాధ

పల్లవి॥ యమునా వీచిక చెప్పింది
మీ అమ్మొకపరి రమ్మందని

అను॥ పిల్లగాలి చల్లగ చెప్పింది
అమ్మ నిన్ను రమ్మందని ॥యమునా॥

చరణం॥ గున్నమావిపై చిగురులు మేసి
రాగవీణపై కొత్త కోయిల
కమ్మకమ్మగా కళ్యాణిరాగం
పాడుచు చెప్పింది అమ్మ రమ్మందని ॥యమునా॥

గోపిక లందరు కృష్ణుని చేరి
వలయము గట్టి నాట్య మాడుచును
వనమయూరులై మేఘరంజనీ
రాగము లోన చెప్పిరి అమ్మ రమ్మందని ॥యమునా॥

యమునాతటిపై కుంజము లందున
ముద్దుముద్దుగ చిలుకలు పలికెను
యోగముద్రలో సర్వము మఱచి
జ్ఞాన ముద్రలో వెలిగి పొమ్మని. ॥యమునా॥

దేవదేవుని ఆన యేమిటో?
పూర్వజన్మపు పుణ్య మేమిటో? ॥యమునా॥

# పాదముద్రలు

**తల్లికి తెలియకుండ కాలిఅందెలు గల్లుమనకుండ చిలిపిపనులు చేయుచు** వెన్న పాలు దొంగిలించుచు పరమార్థము బోధించుచు చరించువాడు చిన్ని కృష్ణుడు అజ్ఞానుల మేలుకొలిపి ముక్తి మార్గము వెదుకుకొను మన్నవాడు యశోదాకృష్ణుడు

ప్రేమకు పరాకాష్ట భక్తి యని మమతకు మారురూపం మోక్ష మని సమతకు సారం పరమాత్మే యని తెలిసికొను మన్నాడు బాలకృష్ణుడు పరీక్షితుని అనేక ప్రశ్నలకు శ్రీశుకుడు సమాధానం చెప్పాడు పరాభక్తికి నిదర్శనం గోపికలని వారికి శ్రీకృష్ణుడు వశమయినాడని వివరించాడు

మహతి మీటుచు నారదుడు కృష్ణతత్త్వాన్ని అన్ని భువనాలలో వ్యాపింప జేశాదు

పల్లవి॥ అందెలు మ్రోయని పాదముద్రలు
తల్లికి తెలియని చిలిపి చేష్టలు

అను॥ చేసెడి వాడు చిన్నికృష్ణుడు
వెన్నలదొంగ ముద్దు కృష్ణుడు. ॥అందె॥

చరణం॥ నిద్ర మునిగిన వారల లేపి
భద్ర మెఱుగగ బోధలు చేసి
ముక్తిమార్గము వెదుకు కొనుమని
నందకిశోరుదు చల్లగ చెప్పెను ॥అందె॥

మమతకు మోక్షము మారు రూప మను
ప్రేమకు భక్తియె వినయ శీల మను
సమతా సారము పరమాత్మే యను
నందనందనుని పలుకులు వినుమా ॥అందె॥

పరీక్షితుని పలు ప్రశ్నము లకు
శుకమహాముని బదులు చెప్పెను
గోపమ్మల భక్తే పరాభక్తి యని
కృష్ణదేవుడే వశమయి పోయెను ॥అందె॥

మహతి మీటుచు పాడెను నారదుడు
భువనము లన్నీ ఒకటై మెచ్చగ ॥అందె॥

# చిన్నికృష్ణుడు

చిన్మయుడగు పరంధాముడు కనిపించడు. బృందావిహారి కనుల ముందు విహరించుచున్నాడు. విశ్వవ్యాపి యగు పరంధాముడే భూమిని సంచరించు పరమాత్మ

అది మధ్యాంతములు లేక భక్తహృదయులను అంటియుండు మురళీమోహనుడే దశదిశలు నిండి యున్నాడు

యశోదమ్మ రోటికి బంధింప గంధర్వుల శాపము తొలగించాడు మన్ను తిన్నావని యశోద అనగా నోరు తెరచి భువనము లన్నీ చూపించాడు. తల్లి అజ్ఞానాన్ని నశింప జేశాడు నిదురించు పిల్లజడకు దూడ తోకను గట్టి జ్ఞానోదయం కలుగ జేశాడు దేవకీసుతునిగా జన్మించి నందనందనునిగా వృద్ధిపొందాడు అతని రూపము నివాసము తెలియ కున్నానని వాపోతూంది. రాధమ్మ

పల్లవి॥ కంటికి అగుపించడు పరంధాముడు
కంటికి కనుపించును చిన్నికృష్ణుడు

అను॥ విశ్వ మంత నిండి యుండు పరమాత్ముడే
భువిని బుట్టి తిరిగి నట్టి వాసుదేవుడు ॥కంటికి॥

చరణం॥ మొదలు లేని వాడు తుదలు లేని వాడు
కలుము లిచ్చు వాడు కడలు నిండి నాడు
భక్తహృదయ మందు భక్తితోడ నుండు
పరము గోరు వారి పంచ జేరి యుండు ॥కంటికి॥

రోట గట్ట తల్లి శాప మణచె సురల
మన్ను తింటి వన్న! నోరు తెరువ మన్న
ఎందు కమ్మ నీకు ననుచు నోరు తెఱచి
భువనసమితి జూపి తల్లి దిగులు మాపె ॥కంటికి॥

పిల్లజడను బట్టి దూడ తోక గట్టి
దూడ గొట్ట పఱచె బిడ్డ బోరు మనియె
నవ్వుచుండె నతడు జ్ఞాన మెఱుగు మనుచు
తెలియు మయ్య వాని తీయ నైన పనులు ॥కంటికి॥

జనన మందె భువిని దేవకి సుతుడై
వృద్ధి నందె మంద నందకృష్ణుడై
ధామ మెఱుగ లేము
రూపు కనగ లేము ॥కంటికి॥

# గిరిధారి

గిరిధారీ! పాపభూయిష్ట మగు అసురీగుణముల తొలగింప జేసి దుర్జనుల దుర్గుణాలను పారద్రోలి గోకులవాసుల మానసాలలో నిరంతరం సంచరించు బృందావనంలో చరించు గోపాల! శేషశయనుడవై మునిజనసేవ్యమానుడవై దీనజన పోషకుడవై జ్ఞానదాత వైనావు

మననము స్మరణము శ్రవణము జపతపములు విధినిషేధములు వినయ వివేకములు అపవిత్రులపవిత్రుల గావించు మాటలు చెప్పువాడు కోమల శ్యామల వర్ణుడు రాధామానసచోరుడు

జ్ఞానభక్తికర్మసాంఖ్యయోగములు జగత్తుకు అందించిన యోగి సత్యశివ సుందరములు భరతజాతికి జీవగఱ్ఱలని తెలిపినవాడు కృష్ణకిశోరుడు.

పల్లవి॥ గిరిధారీ! ఓ గిరిధారీ!
అఘహారీ! అసురారీ! బృందావిహారీ!

అను॥ దుర్బల దుర్జన దుర్గుణ సంహారీ!
గోకులవాసుల మానస సంచారీ! ॥గిరిధా॥

చరణం॥ పరమపావన పతితపోషణ!
సేవితమునిగణ చరణసేవన
శేషశయన ప్రపంచ భరణ
దీనజనావన వేదధారణ ॥గిరిధా॥

మననస్మరణలు జపతపంబులు
వాసుదేవ గుణగానంబులు
విధినిషేధములు వినయ వివేకములు
అపవిత్రు పవిత్రు జేయు పదములు ॥గిరిధా॥

జ్ఞానయోగము కర్మయోగము
భక్తియోగము సాంఖ్యయోగము
జగతికి నొసగిన గీతాకృష్ణుడు
యోగపురుషుడు దివ్యపురుషుడు. ॥గిరిధా॥

సత్యం శివం సుందరమ్ములు
జాతికి చెరగని జీవగఱ్ఱ లని
చాటి చెప్పిన పరమపురుషుడు. ॥గిరిధా॥

# మరువదు భారతం

నందనందన! నీవుగుణాతీతుడవు. రసములకు అందని వాడవు. కోరిన రూపము ఇచ్చు నీవు ఒక్కసారి రమ్ము.

దుష్టుల నణచిన పేదలపెన్నిధివి. భక్తుల బాధలు తీర్చి నా కనులకు కనుపించ వయ్యా కృష్ణా నీ గుణగానము చేయు నాపై కినుక చెందకు నీ కథలతో కాలము గడపు నా మీద కోపము చూపకుము. పురుషులు మెచ్చు రూపం పరమును ఇచ్చు తత్వం నీది లోకము మెచ్చు గుణములు ఎవ్వరికి అందని మమతలు నీవి అని అంది రాధ

ఈ విశ్వం నీరూపం హృదయం నిండా అనురాగం నిన్ను ఎన్నటికి భరతభూమి మరువ దయ్యా కృష్ణా అని అంది రాధ

పల్లవి॥ గుణముల కవ్వల వెలిగే వాడ!
రసముల కందని మమతల వాడ!

అను॥ కోరిన రూపము ఇచ్చే వాడ
ఒకపరి రారా మురిపెము తీర ॥గుణము॥

చరణం॥ పేదల పాలిటి పెన్నిధి వయినా
దుష్టుల చెనకిన వీరుడ వయినా
భక్తుల యిడుములు పార ద్రోలినా
కన్నుల కందవు నందనందనా! ॥గుణము॥

నీ చరితము గానము చేసే
నాపై కినుకను పూనకు కృష్ణా!
నీ కథలతో కాలము గడపే
నాపై యలుకను చూపకు దేవా! ॥గుణము॥

పురుషులు మెచ్చే రూపము నీది
పరమును నిచ్చే తత్వము నీది
జగములు మెచ్చే గుణములు నీవి
ఎవ్వరి కందని మమతులు నీవి ॥గుణము॥

విశ్వ మంత నీ రూపం
హృదయ మంత అనురాగం
మరువదురా నిను భారతం. ॥గుణము॥

# వాడని విరి

ఓమనసా! మాధవు సేవకు నోచలేదా? ఏజన్మదోషమో ఈ జన్మలో దుఃఖములను అనుభవించుచున్నాను.

బాధలలో నిన్ను సేవించాను. అన్నియు సమకూరిన పిమ్మట నిన్ను మఱచి పోయాను. అని నన్ను గురించి ఆలోచించ వద్దు. ఓ కృష్ణా! నీ అడుగుదమ్ముల వాడని విరిగా తళుకులీను శక్తిని ప్రసాదించుము. ఆత్మ పరమాత్మ ఒకటే యని నిరూపించు బలము నిమ్ము. నీ మురళీగానంలో అన్నియు మఱచి హద్దులు లేని సంతసంతో నీలో కరిగి పోనిమ్ము.

పల్లవి॥ మూగ బోయిన ఓ పిచ్చి మనసా!
మాధవు సేవకు నోచ వైతివా?

అను॥ ఏజన్మదోషమో యీ జన్మలోనా
బంధించి బాధించి వేధింప నౌనా? ॥మూగ॥

చరణం॥ కష్టసంద్రమున మునిగిన నాడు
నీవని తపించి కొలిచితి నయ్యా!
అన్నీ కలుగగ గతమును మఱచి
చెలిమి కడలిలో త్రోసితి నయ్యా! ॥మూగ॥

నీ పదముల వాడని విరినై
వెలిగే భాగ్యము నొసగుము దేవా
ఆత్మ పరమాత్మ యొకటే యొక టను
సంస్కృతి నిలిపే బలము నీయుమా ॥మూగ॥

మోహనమురళీ రావము లోన
సర్వము మఱచి నీలో కలసి
హద్దులు లేని మోదము లోన
తనివి తీరగ మునగ నీయుమా! ॥మూగ॥

రాధకు ప్రాణము నీవేరా
జాతికి జీవము నీవేరా
జగతిని బ్రోచుట ధర్మమురా
సర్వజీవులు నీవేరా! ॥మూగ॥

# కదలిరావయ్యా

ఓ కన్నా! నా యింటికి వచ్చి నాచివరిక్షణము వఱకు మాటాడుము. నిన్ను విడచి ఉండ జాల. నిను చూడక జీవించ జాల అని దుఃఖముతో రమ్మంటూంది రాధ

సాగిలి వేడలేను పూజించ చేతులు లేవవు గొంతు మూగ పోయింది దృష్టి మందగించింది. పద్మవదనమో చంద్రముఖమో నీలదేహమో పీతాంబరమో కరములలో శంఖచక్రములో గదాఖడ్గములో చూడ జాలను. మంచము నుండి లేవ జాల ఎవరూ లేని దాన నయితి పరమును సిరులను కోరను నేను తిను ఆహారమే నీకు తినిపింతు

జీవచ్ఛవముగ భారమైన బ్రతుకుతో ఎన్ని జన్మములు నీకై ఎదురుచూడవలయు గోపాల! అని వాపోవుచున్నది రాధ.

పల్లవి॥ కదలి రావయ్యా! నా యింటి వరకు
మాటాడ వయ్యా! తుది శ్వాస వరకు

అను॥ నిన్నొదలి నేనుండ జాలను దేవా!
నినుగాంచ కుండిన జీవింప రావాః ॥కదలి॥

చరణం॥ సమయము మించెను సాగిలి వేడ
కరములు లేవవు పూజలు సేయ
గానము సేయగ పలుకదు గొంతు
రూపము చూదగ కలుగదు దృష్టి. ॥కదలి॥

పంకజవదనమొ చంద్ర ముఖమో
నీలదేహమో పీతాంబరమో
చేతుల లోపల శంఖమొ చక్రమొ
కనుగొన జాలర యశోద పుత్ర! ॥కదలి॥

ఖట్వారోహనై కదల లేనుర
నాయను వారలు లేని దానర
పరమును గోరను సిరులను వేడను
కలిగిన గంజియె త్రాగించెదను. ॥కదలి॥

నడపీనుగునై బ్రతుకు భారమై
ఎన్ని జన్మములు వేచి యుందురా! ॥కదలి॥

# చిరంజీవి

దేవకీకృష్ణా! నీవు చిరంజీవివి. త్యాగమయం నీ జీవితం. మానవసేవలో నీ జన్మధన్యం అయింది.

భువనాల పాలించు జ్యోతివి, జన్మల నిచ్చు విధాతవు, అధర్మ మణచు రుద్రుడవు అయినా మహితుడవు మధురుడవు ఎన్ని యుగములు గడచినా మరపుకురావు. నీ నీలదేహకాంతి లోకంలో నిలచింది. తలచి చూడ నీవు బోధించిన న్యాయం వెలుగుతూంది. తలచిన రూపంలో నీవు దర్శన మిచ్చుచున్నావు వెన్నెలలో తడిసిన బ్రతుకులు చిగుళ్ళలో విరిసిన పూవులు ఫలాలు ఆనందంతో నిండిన మనస్సులు. అడిగిన వారికి కరుణించితివి. నన్ను మాత్రము చూడవు

నీవు చెప్పిన గీతాధర్మాలు ఆచరించినవారు లోకంలో కల్పకల్పములు జీవింతురు.

పల్లవి॥ చిరంజీవి వయ్యా దేవకితనయ
త్యాగమయ మయ్యా నీదివ్యచరిత!

అను॥ స్వజనము విడచి జగముల తలచి
లోకము లేలగ జనముల వలచిన ॥చిరం॥

చరణం॥ జగముల నేలే జ్యోతివి అయినా
జనమల నిచ్చెడి విధాత వయినా
అధర్మ మణచే రుద్రుడ వయినా
మధురమూర్తివి మహితశక్తివి. ॥చిరం॥

యుగములు చనినను మరువదు లోకం
మనసుల నిలచిన మేల్మణి ధామం
తరచిన తగవుల వెలిగెడి భావం
తలచిన విధమున కనపడు రూపం. ॥చిరం॥

కురిసిన వెన్నెల తడిసిన బ్రతుకులు
తొడిగిన చిగురులు విరిసిన సుమములు
మనమున కులుకులు పండిన ఫలములు
సరగున నిచ్చితి వడిగిన వారికి. ॥చిరం॥

గీతార్థములు ఎఱిగిన జగము
కల్పకల్పములు నిలచుట నిజము. ॥చిరం॥

# వెన్నదొంగ

నవనీతచోర! గోపికలు నీరు అందించ నేను నీకు లాలపోసెద. బృందావిహారా! ఊయెలలో పరుండ బెట్టి లాలి పాడెద అని తియ్యగా యశోద అంది.

ఇరుగు పొరుగమ్మలు గంధము పూయ పునుగు జవ్వాజి సాంబ్రాణి ధూపములు వేసెదను. ముంగురులు దువ్వుచు గోపికలు కితకితలు పెట్టి నవ్వుచుండిరి. సుమబాల సమకన్యలు చుట్టుముట్టి పాటలు పాడుచుండిరి. కొందరు మల్లెమాలలు తలలో తురుము చుండిరి

బుగ్గ గిల్లినవారు మూతి పుణికినవారు చుబుక మంటినవారు ముద్దు పెట్టినవారు కన్నయ్యను వివిధరీతుల అలరించుచుండ ఊయెలలో నుండి రాగాలు వినుచు నిదుర పొమ్మని యశోద లాలించింది నందకిశోరుని

పల్లవి॥ లాలపోసెద నీకు నవనీతచోర
లాలి పాడెద నీకు బృందావిహార!

అను॥ గొల్లభామలు వచ్చి జలకమ్ము పోయ
పన్నీటి జల్లులై మురిపాలు కురియ ॥లాల॥

చరణం॥ ఇరుగమ్మ పొరుగమ్మ గంధమ్ము పూయ
పునుగు జవ్వాజుల ధూపమ్ము వేసె
తలచిక్కు దీయుచు తరుణులు కొందరు
కితకితలు పెట్టి కిలకిలా నగిరి ॥లాల॥

సుమబాలలతో ఎకసక్కె మాడు
కన్నెపిల్లలు చుట్టి ఏలలు పాడు
మల్లెమాలలు దెచ్చి మానినీమణులు
కురులలో గూర్చిరి కోర్కెలు తీర. ॥లాల॥

బుగ్గగిల్లిన భామ మూతి పుణికిన రామ
ముద్దుపెట్టిన కన్నె చుబుక మంటిన చెలియ
చంక నెత్తిన చాన సరము లిచ్చిన ఉవిద
బిత్తరి వగు నిన్ను అలరించు చుండగా. ॥లాల॥

తొట్టి మంచములోన చిట్టి నవ్వులతోడ
నిదురించరా కన్న రాగాలు వినుచు. ॥లాల॥

# వేతసికుంజము

రాధామాధవుల అనుబంధం గురించి చెప్పుటకు వేతసికుంజం రమ్మంది. వరదుని చూచుటకు ఆలసింపక బయలుదేరిరమ్మంది.

రాధాకృష్ణులు ఆత్మపరమాత్మలని తెలుపుటకు విరులగంధపు మత్తును వ్యాపింప జేసింది వేతసి. యమునలో ఎగసిపడు తరంగములు మురళీలోలుని తీయని స్వరాలయినవి. పిల్లనగ్రోవిని అంటిన పీయూషం విశ్వశాంతిని గూర్చు సామవేద గానంగా శ్రుతి చేసిన రాగమైంది

బృందావనంలోని గోవుల రాకపోకల్లోని వేణునాదాలు గోపాలుర పదాలలో తనివితీర వినుటకు వేతసి రమ్మంది వారి దివ్యానుబంధం కాంక్షలు లేని కర్మానుబంధ మని తెలుపుటకు వేతసి రమ్మని పిలిచింది

పల్లవి॥ వేతసికుంజము పిలచింది
రాధామాధవ బంధము తెలుప

అను॥ పరుగు పరుగున రమ్మని చెప్పింది
వరదుని చూడగ వేళంది. ॥వేత॥

చరణం॥ రాధంటే కను పించని ఆత్మే నని
మాధవు డంటే అవ్వలి పరమాత్మే యని
విశదము చేయగ విరుల విసరుతో
వేతసి గంధము మత్తిల విసరింది. ॥వేత॥

యమునాతటమున ఎగసిన అలలు
మురళీలోలుని తీయని కలలలు
పిల్లనగ్రోవిని అంటిన సుధలు
శ్రుతి చేసిన రాగాలై సామవేద గానాలై
విశ్వశాంతి సూత్రాలై వినిపించగ ॥వేత॥

బృందావన వీధులలో
గోవుల రాకల పోకల లో
వేణువు పలికే గానంలో
గొల్ల పిల్లల సుద్దులలో
చూడగ తనివి తీరగ రమ్మని. ॥వేత॥

రూపవర్జిత దివ్యానుబంధం
కాంక్షలు లేని కర్మాను బంధ మని. ॥వేత॥

# కృష్ణయ్యా

కృష్ణా! నాకు తల్లీతండ్రీ గురువు దైవం అన్నీ నీవే. దీనులపాలి రక్షకుడవు నీవు నన్ను కాపాడు వాడవు నీవే. అని పలికింది రాధ.

జన్మలకందని ఫలము కర్మల కంటని ఫలము సంసారమునకు అవ్వలి ఫలము నీవు సర్వులకు భద్రము గూర్చు వాడవు సమస్తము నీవు. మానవుల భాగ్యం నీవు. మట్టిని మనిషిగ మలచిన వాడవు నీవు. పుట్టిన భూమికి కూర్చిన వాడవు నీవు. మానవసేవ చేయుచు ఎవ్వరికి అందని వాడవు భక్తుల పాలి పరమ భక్తుడవు రుక్మిణికి అంది సత్యకు అందని వాడవు.

కంసుని వంటి దుర్మార్గులను అణచి ధర్మము నిల్పిన వాడవు అర్థోక్తిగా రాధ నన్ను గురించి ఏ మాలోచించావంది

పల్లవి॥ అన్నీ నీవే నయ్యా కృష్ణయ్యా!
తల్లీతండ్రీ గురువూ దైవము నీవే నయ్యా!

అను॥ దీనుల పాలిటి ప్రత్యక్ష దైవము నీవయ్యా!
నన్ను బ్రోవగ అవతరించిన దేవదేవుడవు నీవయ్యా! ॥అన్నీ॥

చరణం॥ జన్మజన్మల కందని ఫలము నీ వయ్యా!
కర్మాకర్మల కంటని ఫలము నీ వయ్యా!
దారాపుత్రుల కవ్వలి ఫలము నీ వయ్యా!
సుద్దులు చెప్పీ భద్రము గూర్చే దీ వయ్యా. ॥అన్నీ॥
సృష్టికి ప్రాణము పోసే వాడవు నీ వయ్యా!
తీరుగ మలచిన మానవ భాగ్యము నీ వయ్యా!
మట్టిని మనిషిగ తీర్చిన వాడవు నీ వయ్యా!
పుట్టిన భూమికి కూర్చిన వాడవు నీ వయ్యా! ॥అన్నీ॥
మానవ సేవలో తిరిగే వాడవు నీ వయ్యా!
అందరి వాడవు అందని వాడవు నీ వయ్యా!
భక్తుల పాలిటి పరమభక్తుడవు నీవయ్యా!
రుక్మిణి కందీ సత్యకు అందవు నీ వయ్యా! ॥అన్నీ॥
కంసుని అణచిన కళ్యాణ మూర్తివి నీ వయ్యా!
ధర్మము నిల్పిన ధర్మమూర్తివి నీ వయ్యా! ॥అన్నీ॥

# చిఱుగాలి

ఓ చిఱుగాలి సద్దుసేయ వద్దు. కన్నయ్యా వేణుగానాలు వింటూ పదముల సరిగమలలో ఆనందాన్ని అనుభవించాలి. ముంగురులు మోమున కదలు చుండగ నీలమేఘశ్యాముని అందాన్ని చూడాలి గోలోక మంతయు కదలి మాధవుని చెంత చేరాలి

కృష్ణయ్య మమతలో తడిసి పాపము లన్నియు కడిగి వేయాలి కలకాలం జగత్తులో భాసిస్తూ కృష్ణుని పాదాలపై పుష్పం కావాలి విశ్వశాంతికి త్యాగమయ జీవనం గడపాలి యశోదా తనయుని పొందులో అతని హృదయంలో స్థానాన్ని సంపాదించుకోవాలి

పున్నమివెన్నెల కురియుచుండ మానసవీణ లయలు హొయలు పోవాలి మంచి ఆలోచనలతో తులలేని భోగాలు అనుభవించాలి

అరిలోకము నశించి సురలోకము రావలెనని రాధకాంక్ష

పల్లవి॥ సడిసేయ వద్దమ్మ చిఱుగాలి కృష్ణయ్య గీతాలు వినాలమ్మా॥
వేణులోలుని గానాలు త్రాగా లమ్మా పదాల సరిగమల కులకాలమ్మా!

అను॥ అలకలు ముఖమున అళులై కదలగ నీలమేఘుని సొగసు చూడాలమ్మా!
మాధవు ముందర వ్రాలా లమ్మా! గోలోక మంతయు కదలాలమ్మా!
॥సడి॥

చరణం॥ గిరిధారి మమతలో ముద్దముద్దగ తడియా లమ్మా!
జనమ జనమల పాపాలు కడగా లమ్మా!
చిరకాల మీ జగతి వెలగా లమ్మా!
కృష్ణయ్య పాదాల పుష్పమై రాలా లమ్మా! ॥సడిసే॥
నీలమేఘుని హృదయాన నిలవా లమ్మా!
త్యాగమయ జీవనము నేర్వా లమ్మా!
విశ్వశాంతిని కోరి బ్రతకా లమ్మా!
యశోదా పుత్రుని పొందు పొందా లమ్మా! ॥సడిసే॥
మానస వీణను మీటా లమ్మా!
పున్నమి వెన్నెల కురియా లమ్మా!
తులలేని భోగాలు పొందా లమ్మా!
దారిద్ర్యభావాలు తొలగా లమ్మా! ॥సడిసే॥
అరిలోక మంతయు అణగా లమ్మా!
సురలోక మంతయు రావా లమ్మా! ॥సడిసే॥

# ఒడిలోపాప

యశోదా మందిరంలో నందసుందరునిగ బోసినవ్వుల వెల్లులతో యశోదమ్మ ఒడిలో నిండిన పాపను.

భక్తులకు పొత్తిళ్ళలోని బిడ్డగ ముక్తులకు సమతను పంచిన పసివానిగ యోగులకు పూర్ణపురుషునిగ రాగము పంచిన వాడను. కులమతముల కతీతముగ కుబ్జకు ముక్తి కుంతికి రక్షీ పంచిన వాడను. ద్రౌపది మానము కాచిన శక్తి నాదని తెల్పుటకు యశోద ఒడి జేరితిని. భోగములు భాగ్యములు కామములు బలములు సూర్యకాంతులు గత మగునని మరల చేరునని, అనిత్య మీ జగత్తని తెల్పుటకు నీ ఒడి జేరితిని.

చింతల మున్గిన మీరు కర్తలు గారని తెల్పుటకు మీ ఒడిలో పసిపాప నైతిని.

పల్లవి॥ నీ యొడిలో నిండిన పాపనై పసిపాపనై
బోసి నవ్వుల వెల్లునై నును వెల్లునై

అను॥ నంద సుందరునై యశోదామందిరునై
వెలిగిన పాపను మీ కనుపాపను. ॥నీయొడి॥

చరణం॥ భక్తుల జగమున పొత్తిలి పాపను
ముక్తుల కనులకు సమతా పాపను
యోగుల దృష్టికి పూర్ణపురుషుడను
రాగము పంచిన రాధాకృష్ణను. ॥నీయొడి॥

కులమూ మతమూ కూల్చిన వాడను
కుబ్జకు ముక్తీ కుంతికి రక్షీ
ద్రోవది మానము కాచిన శక్తీ
నాదని తెల్పగ నీ యొడి జొచ్చితి. ॥నీయొడి॥

గణికా భోగము కాముని కామము
బలమూ భాగ్యము భానుని తాపము
గత మగు చుండును వెలుంగు చుండును
శూన్యము ఇది యని తెలియ జేయగా. ॥నీయొడి॥

చింతల మగ్గు చిద్విలాసుల
మీరలు కర్తలు కారని తెల్ప
నీ ఒడి లోపల పాప నైతిని
పసిపాప నైతిని. ॥నీయొడి॥

# నీలాలనింగి

పరయోగముద్రలోని రాధాకృష్ణులు నీలాలనింగిలోని తారాచంద్రులవలె ఒకరికి ఒకరుగా జత అయ్యారు.

ధర్మయుక్త మగు ధనము నీతి పూత మగు నడక శుభము కలిగించును. కలిమి కోసము చేయు స్నేహం స్వార్ధపూరిత మగు మమకారం భయము కలిగించును. కర్మఫలము కోరని కర్మ సత్యంతో కూడిన అనురాగము సౌఖ్యము నిచ్చును సంఘమును విడిచిన సామ్యవాదము మోక్షకాంక్షతో కూడిన భజన ప్రమాదము. శత్రుత్వము పారద్రోలు ప్రేమ యుగధర్మంతో కూడిన ఆలోచన శ్రేయస్సును కలుగ జేయును కాలమును అనుసరించని వర్ణవాదము ప్రాణ మీయని ధర్మవాదము భీతిని గలుగ జేయును

నందబాలుని కర్మవాదము రాగవిప్లవ ముక్తి వాదము శుభముల కలిగించును.

పల్లవి॥ నీలాలనింగిలో తారాచంద్రులై
రాధాకృష్ణులు పరయోగముద్రలో

అను॥ పీయూషగంగలో సరిగమల సారంలో
ఒక్కరి కొక్కరుగ జతగూడు బ్రతుకులో ॥నీలా॥

చరణం॥ నీతిపూతమౌ నడత శుభం
ధర్మయుక్తమౌ ధనం శుభం
కలిమి కోసమౌ చెలిమి భయం
స్వార్ధ భూతమౌ వలపు భయం ॥నీలా॥




కర్మఫలము కాంక్షించని కర్మ శుభం
సత్యసంగమ మోహవాదం శుభం
సంఘవర్జిత సామ్యవాదం భయం
మోక్షవాంఛిత భజన వాదం భయం ॥నీలా॥

శత్రునిర్జిత ప్రేమవాదం శుభం
యుగపుధర్మం ఎంచువాదం శుభం
కాలమెంచని వర్ణవాదం భయం
ప్రాణ మీయని ధర్మవాదం భయం ॥నీలా॥

ద్వాపరేశుని కర్మవాదం శుభం
రాగవిప్లవ ముక్తివాదం శుభం. ॥నీలా॥

# అంతర్లోకం

**తొలిసంజ కాంతుల్లో మలిసంజ ఊహల్లో కృష్ణయ్య మురళిరవళిలో శ్రుతి** కలిపి గొల్లభామలు పాడుచుండుట ఎంత మధురమో.

మందారమకరందపుమత్తులో తుమ్మెదల గీతారావంలో లోకము ఏకము కాగా అంతర్లోకంలో నీ గుణగాన జపాలు కొనసాగుచున్నాయి. బాంసురీరవావర్తనాలు గందు కోయిలల వసంత మాధుర్యాలు భావగాంభీర్యంతో స్వరమాధుర్యంతో లయల సొగసుతో వేతసి కుంజాలు యమునాతటంలో మధుర రాగాలు పలుకు చున్నాయి వంశీలయల్లో మయూర నాట్యాల సౌందర్యాలు మేఘధ్వనుల తిరస్కరించు స్వరంతో పరవసించువారు గోలోకం చేరతారు

దేవకీ కృష్ణుడు కృష్ణుడుగ ప్రకాశింప రాధాకృష్ణుడు దేవదేవుడై దీవించును

పల్లవి॥ మలిసంజ పొద్దులో ముసిరేటి ఊహల్లో
తొలిసంజ రేకలో కదిలేటి కాంతుల్లో

అను॥ కృష్ణయ్య మురళిలో కురిసేటి రాగాల్లో
తనతల్లి మనతల్లి కలిపేటి శ్రుతుల్లో ॥మలి॥

చరణం॥ మందారరాగంలో మకరందం మత్తులో
ఝుమ్మనే నాదంలో తుమ్మెదల గీతంలో
జగమంతా యేకమై అంతర్లోకమై
నీ గుణం నీ జపం అనుక్షణం తలంపులై ॥మలి॥
సుధజల్లు బాంసురీ సురుచిరావర్తనలో
గందుకోయిల గాన వసంత మధురిమలో
భావాల జీవాలు గమకాల గానాల్లో
వేతసీ కుంజాలు విరిసేటి స్వరాల్లో ॥మలి॥
వంశీ నినాదాల చరియించు లయల్లో
మయూర పింఛమ్ము సృజియించు హొయల్లో
నీలమేఘము మించు కమనీయ రవళిలో
పరవసించే జన్మ చేరు గోలోకంలో. ॥మలి॥
దేవకీ కృష్ణుడట దీపించు కృష్ణుడై
రాధాకృష్ణుడట దీవించు దేవుడై. ॥మలి॥

# యమునమ్మ

మురళీగాన స్వరాలవలె యమునా ప్రవాహం అవర్తములు తిరుగుచు గిరగిర చరచర సాగింది.

యమునానది నాట్యం చేయుచు కెరటాల హస్తాలతో ముద్రలు పట్టింది పద్మనేత్రాల్లో వలపులు చిమ్మింది. ధిమిధిమిలు త్రొక్కింది పదవిన్యాసంతో. మేలిమి ముసుగులో గుసగుస లాడింది. క్రీగంటి చూపుతో కాంతులు చిమ్మింది. రాగతానాల్లో సర్వం మఱచి నవ్వింది. రసరాజువు నీ వంటూ రమ్మని పిలిచింది.

అరమరలు రవరవలు లేకుండ బ్రతుకంతా నీ చెంతే యుండాలని అంది సంగీతామృతంలో మనం కదలాడుచు నేను వంశీ స్వరాల్లో లగ్నమై పోవాలి

పులినాలు చలించగ పొదరిళ్ళు విరియాలి మురళికి అధరం అంకితం కావాలని యమునమ్మ అంది.

పల్లవి॥ ఉఱుకుళ్ళ పరమళ్ళ యమునమ్మ
గిరగిరల చరచరల యమునమ్మ

అను॥ వేణువు గమకాల యమునమ్మ
వంకరలు తిరిగింది యమునమ్మ ॥ఉరు॥

చరణం॥ బిరబిరా లేచింది నాట్యాలు చేసింది
కెరటాల హస్తాల ముద్రలు పట్టింది
పద్మాల నేత్రాల వలపులు చిమ్మింది
పాదాల కదలికల ధిమిదిమిల త్రొక్కింది ॥ఉరు॥
మేలిమి ముసుగులో గుసగుస లాడింది
క్రీగంటి చూపుల్లో కాంతులు చిమ్మింది
రమ్మంది నవ్వింది రసరాజు వీ వంది
రాగంలో తానంలో సర్వమ్ము మఱచింది. ॥ఉరు॥
బ్రతుకంత నీ చెంత నిలవాలి యని యంది
అరమరలు రవరవలు మనకింక లేవంది
సంగీత సుధలోన కదలాలి మనమంది
వంశీస్వరాలలో మునగాలి నే నంది. ॥ఉరు॥
పులినాలు కదలాలి పొదరిళ్ళు నవ్వాలి
అధరాలు మురళికి అంకితం అవ్వాలి. ॥ఉరు॥

# గుప్పెడుమానం

గోపికలు ఇండ్లలో ఉట్లలో పెట్టిన పాలు వెన్నలకుండలు కాళీచేసినాడు. జలక్రీడలలో గోపికల మానము హరించినాడు వాకిట నిదురించు కోడలి గౌరవము శయ్యాగృహమందలి దంపతుల మానము పో జేసిన బాలముకుందుడవు నీవు.

కంసుని దుశ్శాసనుని శాసించిన వాడవు నీవు. సాందీపని కుమారుని హరించిన రాక్షసుని అణచిన వాడవు నీవు. పాండవుల నవమానింప పోయిన దుర్వాసుని నరకుని మేనబావ యగు శిశుపాలుని మదమణచిన వాడవు నీవు.

శకటాసుర తృణావర్త కాలయవనాదుల హతమార్చిన వాడవు నీవు. దుష్టుల నణచిననీవు ఎంత నిరీక్షించినా కనుపించ కున్నావు అనుచు రాధ వాపోతూంది

పల్లవి॥ గొల్లలు దాచిన వెన్నల కుండలు గోవిందా!
గోపిక లాటల గుప్పెడు మానము గోవిందా!

అను॥ మూతికి వెన్నతో కోడలి మానము గోవిందా!
కాముక క్రీడా దంపతి మానము గోవిందాః ॥గొల్లలు॥

చరణం॥ మానవహింసకు కంసుని మానము గోవిందా!
మునులను వంచిత సాంబుని మానము గోవిందా!
వలువల నూడ్చిన దుష్టుని మానము గోవిందాః
బాలుని దాచిన రాక్షసు మానము గోవిందాః ॥గొల్లలు॥
కుపితాత్ముడు దుర్వాసుని మానము గోవిందా!
ధర్మము నణచిన నరకుని మానము గోవిందా!
చేదీశుడు శిశుపాలుని మానము గోవిందా!
గర్వితమతి యౌ యింద్రుని మానము గోవిందా! ॥గొల్లలు॥
రాక్షస శకటుని దురంత మానము గోవిందా!
పౌండ్రకవసుదేవుని ధృతమానము గోవిందా!
తృణావర్తుని ప్రళయాంత మానము గోవిందా!
కాలయవనుని కుటిలాత్మ మానము గోవిందా. ॥గొల్లలు॥
అందరి మానము అణచిన వాడవు గోవిందా!
ఎంత వెదకినా అందని వాడవు గోవిందా! ॥గొల్లలు॥

# రారాకన్నా

కృష్ణుని కన్నతల్లి దేవకీదేవి అంటూంది. నన్ను మఱచి పోయావా? కృష్ణా! నా చంటిపాపగ నాకంటిపాపగ రారా. మీ అమ్మను చేతులుచాచి అర్థించుచున్నాను.

పుణ్యముల పంటగ మాకు జన్మించినావు. రాగాలబిడ్డగ మా కంట నిలచావు. మా గుండెను దోచుకున్నావు. మమ్ము రక్షించావు. పాలిచ్చి పెంచక మున్నే వెళ్ళిపోయావు. నట్టింట పాఱాడి గారాలు పోలేదు. దూరంగా వుండి మమ్ము మోహంలో ముంచావు. కన్న! నీవు లేక నిను గన్న దానిగ ఎట్లు జీవింతును. నీ గురించి దుఃఖించుచున్నాను. కోపతాపాలు నే భరించలేను. నీ సహజన్ముల జాడ తెలియదు నీ తండ్రి శోక సముద్రమున వున్నాడు.

గుండె మండు దుఃఖాన్ని దాచాను శోకాగ్నిని చల్లార్చు భారము నీది అని దేవకి దీనాతిదీనంగా విలపిస్తూంది.

పల్లవి॥ ఏఁరా కృష్ణా! అమ్మను మఱచావురా?
రారా కన్నా! అమ్మనురా మీ అమ్మనురా

అను॥ నిను గన్న దేవకీదేవినిరా మీ అమ్మనురా
నాకంటి పాపవై రారా నాచంటి పాపవై రారా. ॥ఏఁరా॥

చరణం॥ పుణ్యాల పంటవై వెలశావు మా యింట
రాగాల బిడ్డవై నిలచావు మా కంట
పసిడి మాటల నిచ్చి దోచావు మా గుండె
దీనబంధుని రీతి కాచావు కనుకంట. ॥ఏఁరా॥
పాలిచ్చి ముద్దాడి పెంచకే యేగావు
పాఱాడి నట్టింట గారాలు పోలేదు
మోహాన ముంచావు దూరాల పాపవై
ఎట్లాగు బ్రదికేది నిను గన్న దానవై. ॥ఏఁరా॥
వాపోవు చున్నాను రావయ్య నా యయ్య
తాపాలు పాపాలు భరియింప లేనయ్య
నీ తండ్రి దీనుడై కుమిలేను చూడయ్య
సహజన్ము లేమైరొ తెలియంగ రాదయ్య. ॥ఏఁరా॥
దాచాను దుఃఖాలు గుండెలో మంటగా
చల్లార్చ లేనయ్య ఒకసారి రారా. ॥ఏఁరా॥

# నల్లనయ్యా

నల్లనయ్యా! బంధమోక్షములు శూన్యపూర్ణములు చెప్ప గల వారేరి? నీ వయినా ఆ రహస్యము దెల్పుము.

సంసారమున చిక్కుట ఈ షణాత్రయముల తగుల్కొనుట బంధమా? అట్లయిన మాంధాత దిలీపుడు రఘురాముడు మున్నగువారు బంధముల విడువలేదు. మోక్ష దూరులు కాలేదు.

సులభకోపు లగు దూర్వాస విశ్వామిత్ర అగస్త్య భృగ్వాదులు తపోభూముల పాలించి శాపానుగ్రహనిగ్రహు లయి దివ్యత్వము పొందారు. మోక్షమును అందుకొన్నారు.

మంచి చెడ్డల మర్మము అష్ట భార్యల బ్రహ్మచారి వయిన నీవే తెల్పుము.

పల్లవి॥ ఏది బంధము? ఏది మోక్షము?
ఏది శూన్యము? ఏది పూర్ణము?
అను॥ చెప్ప గల వారెవ్వరయ్యా!
నీ వయిన తెల్పరా నల్లనయ్యా! ॥ఏది॥
చరణం॥ సంసార సాగరమున చిక్కుట బంధమ?
ఈ షణాత్రయముల తగుల్కొనుట బంధమ?
మాంధాతృ దిలీపరఘురామాది ప్రభులు
విడచి రయ్యు బంధము పొందలేద మోక్షము. ॥ఏది॥
సులభ కోపులు దూర్వాసాగస్త్య విశ్వామిత్ర
భృగ్వాదులు తపోభూముల నేలినారలు
శాపానుగ్రహనిగ్రహు లైన వారలు
దివ్యదృష్టి కాంచలేద? చూడ లేద మోక్షము ॥ఏది॥
పరము నందగ సంసారబంధము అడ్డమ?
క్రోధపూర్ణమౌ తపోబలమ్ము అడ్డమ?
తఱచి చూచిన ఏది మేలుర తెల్పర?
అష్టభార్యల బ్రహ్మచారివి చెప్ప నీకే తగునుర?. ॥ఏది॥
మంచి చెడ్డల మర్మ మేమిటొ?
చెప్ప కుండిన ఎటులరా! ॥ఏది॥

# వరదుడు

మురళీధరా! కనుపింపుము. దేవకీపుత్ర! రహస్య మెందుకు? గోగోపగోపీ హృదిచందన! రాధాధరమృదుపదబంధన! ఆగుము అని దేవకీమాత వేడుతూంది.

కృష్ణా! కన్నీరుమున్నీరు గా కుండ చూడు. చెరలో కన్నాను గుండె లవియ ఏడ్చాను నీ బ్రతుకుకై నీకు దూర మయ్యాను వెఱ్ఱి నయ్యాను ఆలసించక నీ తల్లిని రక్షించరా నీవు నారక్తానివి నీ అనురాగపుటానందాన్ని పొందు భాగ్యమిమ్ము. ఏ సుఖము కోరను. నీ పొందు లభించిన కన్నార చూచి కౌగిలించు కొందును నన్ను కరుణింపుము నా అన్న ప్రేమలో బంధింప బడ్డాను నీ తండ్రి సంకెళ్ళతో ఉన్నాడు నిన్ను చూడ ప్రాణాలతో వున్నాము తండ్రీ! మాకు ఆనందము కలిగింపుము

వరదుడవు వనమాలివి అయ్యావు వేదార్ధవు లోకేశుడవు అయ్యావు ఒక పరి రారా తండ్రీ

పల్లవి॥ కనుపించరా మురళీ మోహనా!
చాటేలరా సతిదేవకీ నందనా!

అను॥ పిలవరా గోగోపగోపీ హృదిచందనా!
నిలవరా రాధాధరమృదుపద బంధనా! ॥కను॥

చరణం॥ కన్నీరు మున్నీరు కాకుండ చూడరా
కన్నాను కారలో కలగాను గుండెలో
విడచాను బ్రతుకుకై పిచ్చినై యున్నాను
జాగేల పిలవరా జనయిత్రి కావరా! ॥కను॥
రక్తమ్ము నాదిరా! రాగమ్ము పంచరా!
భోగాలు కోరరా! పొందుకై ఏడ్తురా!
కన్నార కాంతురా! కౌగిలీ యిత్తురా!
పేదరాలిని నన్ను కరుణించి పిలవరా! ॥కను॥
నాయన్న ప్రేమలో బందినై యున్నాను
నీతండ్రి నిండుగా నిగళాల నున్నాడు
నిను జూచు కాంక్షతో నిలచాయి ప్రాణాలు
మము జేరి సంతోష పఱచరా నా తండ్రి. ॥కను॥
వరదుడ వైనావు వనమాలి వైనావు
వేదార్ధ వైనావు లోకేశు వైనావు. ॥కను॥

# విష్ణుపదం

నందకిశోరా! ధర్మస్థాపకుడ వగు నీ వెంట భూమికి వచ్చాను. భక్తితో నీ భజన సేయనిమ్ము.

పారిజాతాల పూసెజ్జలు పట్టుపుట్టములు పసిడి భూషలు క్షేత్ర తీర్థములు కోరను నిను విడచి జీవించలేను. కాన! విష్ణుపదము పొందు వరమీయుము. దేవా! దివ్యసుమము లెన్ని యో నేల రాలినవి. నే మరలి భువికి వచ్చు పనులు చేయ. నిష్ఠతో నిను సేవించు నను నీలో కలుపుకొనుము. ఆఱు క్రూరమృగములు వెంట బడుచున్నాయి వాటిని మరలించుటకు వేగరమ్ము అబలను రక్షింపుము

పుష్పవర్షము పుణ్య మీయదు నా పూర్వపుణ్యమును మిగుల నీయరా కన్నయ్య అంటూంది రాధ

పల్లవి॥ నమ్మి వచ్చితి నమ్మ మోసగించ కమ్మ
భక్తి భిక్ష మిమ్మ భజన సేయ నిమ్మ!

అను॥ ధరణి ప్రజల కొఱకు ధర్మ మిచ్చు కొఱకు
వెంట వచ్చి నట్టి పడతి రాధ నేను ॥నమ్మి॥

చరణం॥ పూలసెజ్జ కోర పారిజాత మడుగ
పట్టుపుట్ట మడుగ పసిడి భూష లడుగ
అర్థవాంఛ నెఱుగ తీర్థ కాంక్ష ముడుగ
కృష్ణ వదలి బ్రతుక విష్ణుపదము కనగ
దేవ వరము నిమ్ము దివ్యపదము చేర. ॥నమ్మి॥

దివ్యసుమము లెన్నొ దేవ రాలి పోయె
మరల భువికి వచ్చు పనులు నేను చేయ
కొల్తునయ్య నిన్ను కొసరి కొసరి కలియ
కలుపు కొనుము నీలో కమలపత్రనయన! ॥నమ్మ॥

క్రూరమృగము లాఱు కూర్మి తోడ వెంట
తరుము చుండె రార! తిరుగ జేయ రార!
పరుగు లిడగ లేను పడతి నైన నేను
నిన్ను గాంచ కున్న నిలువ నోప నయ్య! ॥నమ్మి॥

పుష్పవర్ష మిలను పుణ్య మీయ దయ్య!
పూర్వపుణ్య మంత మిగుల నీర కన్న! ॥నమ్మి॥

# నారూపం

దేవదేవ! నీ చెక్కిళ్ళలో నా రూపం చూచుకో నీయ వయ్య. అమ్మను నిను కన్నమ్మను యశోదమ్మను చిలిపి పనులు చేయక రారా!

వెన్నముద్దలు మిసిమి మీగడలు పెట్టెద. పన్నీట జలకమార్చి కనకాంబరాలు కట్టెద. బంగరు నగలు మయూరపింఛములతో అలంకరించెద. నీ కంటి పాపలలో నా రూపం చూచుకొన నిమ్ము. చోరవృత్తి ఎందుకు? ముదము పొందు టెందుకు. గోపికల గుంపు నిన్ను దూషించు టెందుకు? నేను చింతించు టెందుకు. కంటి పాపవలె ఇంటిలో నున్న పసిడిబొమ్మ లిచ్చి పాటలు పాడి మురిపింతును. సరిగమలతో జావళీలు పాడుదును. నీలమేఘుని సౌందర్యంలో కరిగిపోవాలని వుంది.

ఇల్లు విడచి మమ్ము విడచి పోవద్దు మా హృదయంలో నీవే నిండి యున్నావు. అని యశోద బాలకృష్ణునితో అంటూంది.

పల్లవి॥ చిదిమిన పాల్గారు చెక్కు టద్దాలలో
నారూపు చూచుకో నీరా కన్నా!

అను॥ అమ్మనురా నిను కన్న అమ్మనురా
యశోదమ్మనురా చిలిపితనాలు పోకురా! ॥చిదిమి॥

చరణం॥ వెన్నముద్ద లిత్తు మిసిమి మీగడ నిత్తు
కనకాంబరము లిత్తు పన్నీట జలక మార్తు
కనకభూష లిత్తు కేకిపింఛము నిత్తు
కంటి పాపలందు నా రూపు కననీర! ॥చిదిమి॥

పొరుగు వారి యింట పుల్లపెరుగు నీవు
మ్రుచ్చిలంగ నేల మోదమంద నేల?
గొల్లభామ లంత గుంపు గట్టి వచ్చి
దూఱుచుండ చూచి దుఃఖ మంద లేను. ॥చిదిమి॥

కంటిపాప వగుచు ఇంటిలోన నున్న
పసిడి బొమ్మ లిచ్చి పాటల మురిపించి
సరిగమల సిరులతో జావళీల నింపి
కరగి పోదునయ్య నీల మేఘ గాత్ర! ॥చిదిమి॥

ఇల్లు విడచి పోకు మమ్ము విడచి పోకు
మనసు నిండ నీవె మమత లన్ని నీవె ॥చిదిమి॥

# తరంగ మృదంగం

ఆమనిలో మల్లియల సుగంధంలా వసంతంలో కోయిల కంఠంలా వంశీగానంలో తారస్థాయిలా యమునా తరంగంలో మృదంగ ధ్వానంలా వేణునాదం వినిపించ మంది రాధ.

దేవతలు మానవులు నాగులు క్రూర జంతువులు బృందావన వాసులు మునులు వంశీరాగంలో ఆడాలి పాడాలి. షట్చక్రములు దాటి ఆనందరాజ్యం చేరి పరమ పురుషుని చెంత పాటాడు పాపలు కావాలి పరమాత్ముని ఒడిలో పండాలి అతని ఆత్మలో చేరాలి. జన్మధన్యమై మోక్షం పొందాలి వేణునాదంలో లోకాలు మురియగా మీ అమ్మ దేవకి వదనం ముదముతో వెలిగిపోవాలి వసుదేవుడు పెద్దగా నవ్వాలి విశ్వానందంగా వంశం రాగ కదంబాన్ని వర్షించాలి

నీ వంశీ మధురరాగ ఝరిలో పరాన్ని పొందాలి శాంత మావరించి అనురాగము పండవలె నని రాధ తపన పడుతూంది.

పల్లవి॥ ఆమని శృంగారంలో మల్లీగంధంలా
వసంత కాలంలో కోయిల కంఠంలా

అను॥ వంశీగానంలో షడ్జమ నాదంలో
యమునా తరంగ మృదంగ ధ్వానం వినిపించరా ॥ఆమని॥

చరణం॥ దివినుండి దేవతలు భువినుండి మానవులు
గోవులూ నాగులూ క్రూర జంతువులు
బృందావన వాసులూ మౌనీంద్ర గణములు
ఆడాలి పాడాలి ఆరాగ సరళిలో ॥ఆమని॥

ఆఱు చక్రాలపై ఆనంద రాజ్యంలో
పరమపురుషుని చెంత పాటాడు పాపలై
ఒడిలోన పండాలి ఆత్మలో చేరాలి
జన్మమే ధన్యమై మోక్షాన మునగాలి ॥ఆమని॥

వేణువు మ్రోయాలి లోకాలు మురియాలి
మీయమ్మ దేవకీ ముఖ మంత వెలగాలి
వసుదేవు డెలుగెత్తి పకపకా నవ్వాలి
వంశమ్ము విరియాలి విశ్వమ్ము మెచ్చాలి. ॥ఆమని॥

నీ గాన ఝరులలో పరమందు కోవాలి
శాంతమ్ము నిండాలి రాగమ్ము పండాలి. ॥ఆమని॥

# ఓరచూపు

చక్కని గోపయ్య చిక్కవేమయ్య. మురారివి బకారివి అయినా నీవు మా వాడవు గోవాడ వాడవు.

గోపభామలు చుట్టు ముట్టి నిను ముద్దాడ అధరం కొరికి నవ్వు కొంటెవట నీవు. పసివానికి ఏమి పనులయ్యా యివి. మీ అమ్మ యశోదదగ్గర ఏమీ తెలియనట్లు బుంగమూతితో ఓర చూపులు చూచు నీ నటనలు మాకు తెలియును. యశోదమ్మ మందలించ అమ్మ ఒడిజేరి పండుకొన్న నిన్ను గోపిక మెల్లగా లాగ చేతిని గిల్లి కడకంటితో చూచు కొంటె కృష్ణా! నిన్ను ఏ మందును.

మూడేళ్ళ బిడ్డవు ఏమి పనులయ్యా యివి ముల్లోకములు చూపి మురిపించు చుంటి వేమి? అని రాధ అక్కడక్కడ విన్న మాటలు తనలో అనుకొంటూంది.

పల్లవి॥ చక్కదనాల గోపయ్య
చిక్కవేమిరా కన్నయ్య?

అను॥ మురారి వైనా బకారి వైనా
మా వాడ వైనా గోవాడ నీదిరా. ॥చక్క॥

చరణం॥ గోపిక లంతా నీ చుట్టు చేరి
మధ్యన చేర్చుక ముద్దాడు చుండ
అధరము కొరికి గొల్లున నవ్వే
కొంటె వాడివి గోపయ్య. ॥చక్క॥

బుంగమూతితో మీ యమ్మ చెంత
ఏమియు నెఱుగని వెఱ్ఱోని రీతి
ఓరగ చూచే నీ నటన లన్నీ
మాకేమి తెలియవా గోపయ్య! ॥చక్క॥

మీ యమ్మ కసరగా (ఏమి) యెరుగని పగిది
అమ్మ యొడిలోన పండిన నిన్ను
గొల్లభామ (యొకతె) మెల్లగా చే లాగ
కరము గిల్లి క్రీగంట చూచిన గోపయ్య! ॥చక్క॥

మూడేళ్ళ బిడ్డవూ యివి యేమిటయ్య!
ముల్లోకములు చూపి మురియింతు వయ్య! ॥చక్క॥

# కళ్యాణమూర్తి

నందనందన నమస్సులు. దేవకి పుత్ర! ఇదిగో మైపూతకై తీసిన శ్రీగంధము. లోకములు పాలించు దేవదేవునకు కుసుమాంజలి

అందెలు మ్రోయు పదపద్మములు గలిగి దినదినాభ్యిద్ధి నందుచు కరిమకరి పోరు అంతము చేసిన వానికి మందార సుధ లందించువానికి గరుడ వాహనము గలవానికి కలహభోజనునిచే కీర్తింపబడు వానికి ధర్మసంస్థాపకునకు భక్త రక్షకునకు నమస్సులు.

శారదజ్యోత్స్న ప్రసాదించుచు యమునా తీరంలో వేణుగానంతో గోపికలను పరవసింప జేయు వానికి నమస్సులు

సుదాముని వాత్సల్యంతో గారవించిన కృష్ణపరమాత్మకు రాధమ్మ భక్తి ప్రపత్తులతో నమస్కరించుచున్నది

పల్లవి॥ వందనం నందనందన!
చందనం దేవకీ నందన!

అను॥ లోకాల సృజియించి పాలించు వానికి
దేవదేవునకు వందనం పుష్పాభి వందనం ॥వందనం॥

చరణం॥ చరణకమలాల మంజీరరావాల విభునకు
రంగారు పొంగారు నీలమేఘ శ్యామునకు
కరిమకరి వాదార్పు కళ్యాణ మూర్తికి
మందార సుధ లిచ్చు మహనీయ దీప్తికి ॥వందనం॥
గరుడవాహన మెక్కు భువనమోహనునకు
మహతి మీటెడు వాని మాధుర్యరోచునకు
ధర్మనిరతిని కామించు ధర్మస్థాపకునకు
భక్త గణముల కాచు కారుణ్య వరునకు ॥వందనం॥
పూర్వపుణ్యమున గోపిక లగు మునులకు
యమునావనంలో ఆనంద లోకునకు
శారదవేళలో వెన్నెల పున్నమికి
వేణునాదంలో తనియించు పురుషునకు. ॥వందనం॥
మాలాకారుని సుదాముని మన్నించి
కోరిక తీర్చిన వటపత్రశాయికి. ॥వందనం॥

# అధరసుధ

ఓ మనసా మోసపోకుము కృష్ణుని జేరి ఆనందింపుము. ఊహా ప్రపంచమున ఊగక భారతీయ తత్త్వ మెఱుంగుము.

పాషాణ హృదయములతో కలిసి యుండలేను అధరసుధను ఈయలేను మధురమైన మధురావాసుని మధురకధలు మరువలేను. అది మానవధర్మము కాదు. భక్త సులభుడగు శ్రీ కృష్ణ భజనలో ముక్తిని వెదుకవలెను. బ్రతుకు నశ్వర మని తెలియును కాన అనాధగ జీవించలేను. నా సర్వస్వము కృష్ణుడే మాయతో వంచించు దుష్టులు సంచరించు లోకంలో యధార్థము దాచి తిరుగుట సాధ్యము కాదు.

కావున! ఓ మనసా నిర్వికారుడు నిర్గుణుడు నిరంజనుడు అయిన గోలోక వాసుని సేవించ మంటూంది రాధ.

పల్లవి॥ మోస పోవకే ఓ మనసా!
కృష్ణుని జేరి మురిసి పోవవే

అను॥ భారత భారతి తలపవె మనసా
ఊహల జగతిని ఊగకె మనసా. ॥మోస॥

చరణం॥ రాతి బొమ్మకు రాగము పంచి
అధరసుధను అందలేను
మధుర కథలు మరువ లేను
మనుజ ధర్మము మరచి పోను. ॥మోస॥

భక్త సులభుని భజనలోన
ముక్తిపధమున మునుగ వలెను
మనిసి బ్రతుకు మాయ మునుగ
అనద నగుచు అడల జాల. ॥మోస॥

మంచి మాటల మనసును దోచి
వంచన చేయ పొంచి చూచు
కుజనులు మసలు కుంభినిలోన
నిజమును పలుకు సుజనుల నెఱుగ. ॥మోస॥

నిర్వికారుని నిరంజనుని
చేరి కొలువవె ఓ మనసా! ॥మోస॥

# శాశ్వతనిద్ర

వంశీవినోదా! ఈ ప్రాణము నీది. తీసికొనుము. రాధ ప్రక్క రాధాకృష్ణవు. యశోద చెంత యశోదానందుడవు

కుంటిసాకులతో దుష్టశిక్షణ చేసిన వాడవు స్త్రీల మధ్య బ్రహ్మచారివి. సర్వము పాలించు విశ్వశక్తివి. నీ గుణగానము చేయజాల నీ పదసేవలోఁబ్రతుక నిమ్ము. పాప పుణ్యములు ఎరుగని నన్ను చీకటి తెరలు తొలగించి కాపాడుము కులమతములను ఆవల విడచి మానవ సేవలో నుంచిన చాలును నీ మదిలో నీడ నీయుము నిన్ను దర్శించ సాధ్య మగుట లేదు

పీయూషము నాకు వద్దు. శాశ్వతనిద్రను నాకు ప్రసాదించుము అని కృష్ణుని వేడుకొంది రాధ

పల్లవి॥ ప్రాణము తీయరా కృష్ణయ్య!
జీవము నీదిరా కన్నయ్య!

అను॥ రాధను చేర్చుక రాధాకృష్ణవు
యశోద ప్రక్కన నందకిశోరవు ॥ప్రాణ॥

చరణం॥ కుంటి సాకుల కొంటె వాడివి
దుష్టుల నణచిన దొడ్డ వాడివి
భామల సందున బ్రహ్మచారివి
సర్వము నేలెడు విశ్వ శక్తివి ॥ప్రాణ॥

నీ గుణగానము చేయ జాలరా!
నీ పద సేవలో బ్రతుక నీయరా!
పాపపుణ్యములు తెలియ లేనురా
చీకటి తెరలను చెనకి కావరా! ॥ప్రాణ॥

మతధర్మంబుల మౌఢ్య మేలరా
మానవ సేవలో మనగ రాదురా
నీ మదిలోపల నీడ నీయరా
కలువల రాయని కాంచ కాదురా! ॥ప్రాణ॥

సుధా మధురిమము చెంత పోనురా
శాశ్వత నిద్రలో ముంచి వేయరా! ॥ప్రాణ॥

# ఎవరికివారు

మురళీమోహన! బాధలకు అంతము తెల్పుము. కపటానురాగాలతో కూలుకొంపను నిలుపకుము.

ఈ లోకం వంచనతో నిండియుంది. తళుకు బెళుకులు వలపు వాంఛలు దుఃఖ కారణములు. పాంచభౌతిక దేహం నిలువదు. మోహానురాగాలు బంధము లని ఎరుంగుదు. ఎవరికి ఎవరూ వుండరు. ఇది ఎరుంగని వారు లేరు బంధమోక్షము కావింపుము.

కాలమును నిలుప లేను దూది పింజవలె తొలగి పోలేను

పల్లవి॥ ఈ రాధకు మరణం ఎప్పుడుర?

నా బాధకు అంతం తెల్పుముర

అను॥ కూర్మితొ వంచన సేయకుర

కూలెడు బ్రతుకును నిలుపకుర ॥ఈ రాధ॥

చరణం॥ మాయా మయమౌ లోకముర

న్యాయము విడచిన విశ్వముర

తళుకులు బెళుకులు నిలువవుర

వలపుల బరువులు దుఃఖముర! ॥ఈ రాధ॥

పాంచభౌతిక దేహముర

ఎంత చేసిన నిలువదుర

మోహానురాగాలు బంధముర

లోకపు తీరు ఎరుగుముర! ॥ఈ రాధ॥

ఎవరికి ఎవరు ఉండరుర

'ఎవరికి వారే యమునా తీరే'

తెలియని వారు లేరుర

బంధము తెంచి కావర! ॥ఈ రాధ॥

కాలము నిలుపగ కాదుర

తూలము పోలిక తొలగనుర! ॥ఈ రాధ॥

# వెలుగు నీది

శృంగార రూపంలో వెలుంగువాడవు ఏమియు నెరుంగని విలాసివి. సర్వము నే నను సన్యాసివి.

బంగరు పుట్టము ధరించి దట్టిలో వేణువు నుంచుకొన్న వాడవు. శిరమున పింఛము మోమున నామము దాల్చిన వాడవు. శ్రీ గంధము అలమిన గగన రూపుడవు. తరగని జ్ఞానమును అందరికి పంచిన వాడవు. ధర్మకర్మములు తెలిపిన సద్గురుడవు. దాసానుదాసుడవు ప్రభువుల ప్రభుడవు శాశ్వత తత్త్వసూత్రాలు లయాన్విత భావాలు కలిమి చూడని స్నేహాలు నలువురు మెచ్చు కదలికలు కలిగిన వాడవు.

ఓ కృష్ణా! ఎవరికి ఎవరూ వుండరు ఇది తెలియని వారు లేరు నాకు బంధమోక్షము కలిగింపు మని వేడుకొంటూంది రాధ.

పల్లవి॥ వెలుగులు పఱచే వలపుల ఱేడా
శృంగార రూపాన వెలిగే వాడా!

అను॥ ఏమియు నెఱుగని విలాసి వయ్యా
సర్వము నేనను సన్యాసి వయ్యా! ॥వెలుగు॥

చరణం॥ బంగరు పుట్టము కట్టిన వాడవు
దట్టిని వేణువు దాల్చిన వాడవు
శిరమున పింఛము చెరగని నామము
శ్రీగంధ మలదిన మిన్నైన రూపము. ॥వెలుగు॥

తరగని జ్ఞానము సమముగ పంచిన
సమతా మూర్తివి సద్గురు మూర్తివి
కర్మము ధర్మము తెలిపిన జ్యోతివి
దాసాను దాసవు ప్రభువుల ప్రభుడవు. ॥వెలుగు॥

కాలము చెల్లని సూత్రాలు
తాళము తొలగని రాగాలు
కలుములు కొలవని చెలువాలు
నలువురు కొలిచే చలనాలు. ॥వెలుగు॥

జీవుల యందలి జీవము నీవు
జగతిని ప్రోచే స్వామివి నీవు. ॥వెలుగు॥

# మందలో మాధవ

మాధవ! నాగాధ వినుము. లోకము వేధించుచున్నది. నీవు వినకున్న ఎవరు విందురు కన్న

మందసుందర! పుణ్యపాపములు మానావమానములు నాకొద్దు ఏ బంధములు నాకొద్దు. నిన్ను విడచి బ్రతుకు భారంగా బాధలతో రాధ తిరుగలేదు నీకై సాధు సన్యాసులను అడిగాను. వేద వీధులలో వెదకాను నీవు లేని పరము నాకొద్దు. పిల్లన గ్రోవిగ నిను అధరములు పిలువవు నీ లీలలు హృదయము మరువదు దయాసాగర! ఆనందంతో వచ్చి నా పూజలను అందుకొనుము

వంకర మాటలు పిచ్చి సమాధానములు చెప్పక నన్ను కాపాడుము అని అంది రాధ.

పల్లవి॥ వినవయ్య కృష్ణ రావయ్య కృష్ణ
కనవయ్య లోకమ్ము కారించు కృష్ణ

అను॥ రాకున్న వినకున్న ఎటులన్న
ఓ కన్న నీకన్న ఎవరన్న ॥వినవయ్య॥

చరణం॥ మన్నించు పాలించు మందలో మాధవ
పున్నాలు పాపాలు పోరులూ పొందులూ
బన్నాలు బంధాలు మన్నారు నాకొద్దు
నన్నేలు కోవయ్య! దణ్ణాలు నీకయ్య ॥వినవయ్య॥

రాధమ్మ నిన్వీడి బ్రతుకంత భారాన
బాధల్ని తినుకొంటు బందాడు లోకాన
సాధుల్ని సంతుల్ని సాగిలి మ్రొక్కాను
వీధుల్లో వేదాల్లో వెదకాను తాపాన ॥వినవయ్య॥

పదములు కదలవు పరమందు కొనగ
పెదవులు పిలువవు పిల్లన గ్రోవిగ
హృదయము మరువదు కృష్ణుని లీలలు
ముదమున సదయుడ ముంగిట నిలువర. ॥వినవయ్య॥

కుంటి సాకులు కొంటె మాటలు
అంట లేనుర కంట కావర! ॥వినవయ్య॥

# చీఁకు

ప్రాణాలు ఉండగ ఒకసారి చూడవయ్యా గోపయ్యా! శోకజలధిలో నున్న నన్ను కాపాడు భారము నీది.

అహంకారమున నిన్ను మఱచి కన్నులుండి లేనిదాన నయినాను. ఇప్పుడు బాధలలో చింతలలో మునిగాను. కుములుచు కుందుచున్నాను. ఇప్పుడు రమ్ము. ఏమియు నిన్ను కోరను. నినుజూచి ఆనందింతును. లోకము నన్ను ప్రశ్నించుచున్నది నందబాల! నీ కంటె నాకు ఎవరూ లేరు. గ్రుడ్డిని అయినను మ్రానును అయినను నీ స్పర్శతో సుఖింతును.

ఏమియు చెప్పలేని దాన నయి కనులుమూసికొని దుఃఖంతో పడిపోవుదు నయ్యా! కన్నయ్యా! అని వాపోతూంది రాజీవలోచన రాధ

పల్లవి॥ ఒకపరి ఒకపరి కనుమయ్యా
అసువులు ఉండగ రావయ్యా.

అను॥ శోకజలధి మునిగా నయ్యా
తీర్చుభారము నీదే నయ్యా! ॥ఒకపరి॥

చరణం॥ కన్నుకానక నేను నడచాను
చెంత నున్న నిన్ను మఱచాను
చింత జెంది వంత మునిగాను
కుందు చున్నాను కుములు చున్నాను. ॥ఒకపరి॥

వరము లడుగ ధనము లడుగ
కరము జాచి పరము గోర
సరగ రాగ తరుణ మిదిర
మురిసి పోదుర ముద్దు కృష్ణ! ॥ఒకపరి॥

లోక మెల్ల అడుగుచుండె
వీక వీడి వేగ రార
చీఁకు నైన మ్రాఁకు నైన
నాకు నీవె నంద గోప! ॥ఒకపరి॥

చెప్ప లేక కనులు విప్పలేక
వగచి వగచి వ్రాలి పోదు. ॥ఒకపరి॥

# ఎండిన కన్నులు

దేవకీనందనా! యశోదమ్మ కౌగిట చిన్నికృష్ణుడవు. యమునాతీరంలో గోపీ కృష్ణుడవు. రాధామందిరంలో వంశీకృష్ణుడవు నీవు.

నీకై శోకించి శోకించి రాధ కన్నులు ఎండిపోయాయి. వ్యధాభరితగాధల్తో బాధపడుచు నిన్ను ఎలుగెత్తి పిలచి పిలచి దిక్కులు చూస్తూ నిలచింది. రాధకు జీవం నీవు. బాధలకు మూలం నీవు. వేదనతో వున్నాను. వేగముగ రావలసినది. మందారమాల వాడలేదు. బృందావనాన్ని వీడలేదు. మునులు నా నమస్కారము అందుకొనలేదు మాటాడ లేదు. సదానందుడ వగు నిన్ను చూడలేదు.

యదునందన! నేను చిందులు వేసే చిన్నారిని కాను. రంగులు మార్చు వయ్యారిని కాను అని అంది రాధమ్మ.

పల్లవి॥ యశోద సందిట్లో చిన్నికృష్ణ
యమునా ముంగిట్లో గోపీకృష్ణ!

అను॥ బృందావనంలో నందకృష్ణ
రాధామదిలో వంశీకృష్ణ. ॥యశోద॥

చరణం॥ ఏడ్చియేడ్చి యెండె కనులు
వ్యధల కథలు హృదుల నిలచి
కలగి కలగి కలతపడుచు
పిలచిపిలచి దిశలు నిలచె. ॥యశోద॥

రాధకు జీవం నీవే నయ్యా
బాధకు మూలం నీవే నయ్యా
వేదన లోనే మునిగా నయ్యా
వాదన మానీ వేగమె రావయ్యా! ॥యశోద॥

మందారమాల వాడలేదు
బృందావనాన్ని వీడలేదు
వందార మునులు పలుకలేదు
నందనందనుని కాంచలేదు. ॥యశోద॥

చిందులు వేసే చిన్నారి కాను
వన్నెలు మార్చే వయ్యారి కాను. ॥యశోద॥

# హిమాగ్ని

చల్లని మనస్సుగల రాధ హృదయం నుండి కనుల నుండి వేడి నీరు కారుతూంది. అది గంగా ప్రవాహంగా సముద్రంలో కలుస్తూంది.

గలగలా రావంతో వెన్నెల వెలుగుల్లో రాధమ్మ నవ్వుల తళత్తళల్లో కాంతిలు తూంది. నీలమేఘంగా నెమలిపింఛంగా ఇంద్రచాపంగా నా కంటి వెలుంగుగా రారా కృష్ణా! నీ గురించి పాడిపాడి అలసిపోయాను. నిను వేడివేడి మూగను అయ్యాను. త్వరలో మాడి మసిఅవుతాను. కావున దయతో రావయ్య కృష్ణా

నీ మనస్సులో నా మనస్సు నీ హృదయంలో నా హృదయం ఆలస్యము చేయక కలుపుకొను మని ప్రాధేయ పడింది రాధ

పల్లవి॥ మంచుకొండ మండింది
కన్నీరై పొరలింది

అను॥ గంగగా మారింది
సంద్రలో కలిసింది. ॥మంచుకొండ॥

చరణం॥ గలగల కలకల ధ్వానంతో
మంజుల మంగళ రావంతో
విరిసిన వెన్నెల వెలుగుల్లో
రాధమ్మ నవ్వుల తళత్తళల్లో. ॥మంచుకొండ॥

మేఘమై నీలమేఘమై
పింఛమై నెమలి పింఛమై
చాపమై ఇంద్రచాపమై
వెలుగై నా కంటి వెలుగై. ॥మంచుకొండ॥

పాడిపాడి అలసి పోతిర
వేడి వేడి మూగ నైతిర
మాడిమాడి మన్ను గలతుర
వడి వడిగా కరుణ చూపర. ॥మంచుకొండ॥

మదిలో నామది కలుపుకో
హృదిలో నా హృది మలచుకో. ॥మంచుకొండ॥

# లల్లిరా

కృష్ణా! నీకు వెన్నముద్దలు గోరుముద్దలు తినిపించెద. నీవు వేణుగానం చేయనే పాట పాడెద.

నాదబ్రహ్మము వేదబ్రహ్మము నీవని సేవింతు. పాత జీవితము నాశనము చేసి కొత్త జీవితమును చిదిమివేయుము. భారము నేరము అనక దూరతీరములలో వున్నప్పటికి నీ ఆనతి మీఱని రాధను నేను. దేవా! నాకై రావలసినది. నల్లనయ్యా! గొల్లపిల్లలు గోవులు ఆటలలో మునిగి వున్న వేళ మెల్లమెల్లగ రారా కృష్ణా.

నీ రహస్యము బయటికి రానీయను. అందరికి తెలియునట్లు ప్రవర్తించను. అని అంది రాధ.

పల్లవి॥ గోరు ముద్దలు వెన్న ముద్దలు
పాల మీగడ వలచి యిచ్చెద

అను॥ వేణుగానము చేయుచుండగ
రాగ మందుక పాట పాడెద. ॥గోరు॥

చరణం॥ నాదబ్రహ్మము వేదబ్రహ్మము
నీవు నీవని నిలచి మ్రొక్కగ
పాతకుండలు పగులగొట్టుము
చేతకుండలు చిదిమి వేయుము. ॥గోరు॥

భారమైనను నేర మైనను
దూరతీరము చేరుకొన్నను
మేర మీఱని నారి రాధను
చూర లాడగ రార దేవర! ॥గోరు॥

గొల్ల లందఱు గోవు లన్నియు
ఉల్లసంబున చల్లచల్లన
చల్లచల్లగ పిల్ల చేష్టగ
మెల్లమెల్లగ లల్ల! రారా. ॥గోరు॥

గుట్టు రట్టు చేయ నయ్యా!
తెలియ నట్లు మెలగె దయ్యా! ॥గోరు॥

# తలపుతెర

కన్నా! నిన్ను కలలో పట్టి బంధించలేను. ఇలలో వెదకలేను. తలపులనే ద్వారాన్ని మూయలేను. వలపుల కుదుపుల భరించలేను.

యమునతో యమున, కలువతో కలువ, భామతో భామ, రాధతో రాధ మాట్లాడు చున్నారు. మదిరాపానం చేయుదానను కాను మధురను వీడలేను. మాట మార్చ నా చేతకాదు అంది రాధ. నిన్ను మఱచుట నాకు సాధ్యము కాదు. నీటిపై వ్రాత నిలువదు. నిజము వెలుగులు నశించవు నీపై భక్తి పెరుగు నట్లు నీ భజన నిత్యము చేయునట్లు శక్తి నిచ్చిన శాంతిని పొందుదును.

విశ్వశాంతిలో అందరు జాగ్రత్తగ ప్రవర్తింతురు అని అంది రాధ

పల్లవి॥ కలలోన నేను పట్ట లేనురా
ఇలలోన నేను వెదుక జాలరా

అను॥ తలపుల తలుపులు మూయు టెటులరా
వలపుల కుదుపుకు తాళు టెటులరా! ॥కలలో॥

చరణం॥ యమునతో యమున
కలువతో కలువ
చెలువతో చెలువ
రాధతో రాధ. ॥కలలో॥

మదిర త్రాగే మనసుకాదు
మధుర వదలి మనగ లేను
మాట మార్చు మనిసి గాను
మరువలేను నిన్ను కన్న! ॥కలలో॥

నీటివ్రాత నిలువ దయ్యె
నిజము వెలుగు నిలచు నయ్య!
భక్తి పెరుగ భజన సేయ
శక్తి నీయ శమము గాంతు. ॥కలలో॥

శాంతిలోన లోకమెల్ల
భద్ర మనుచు భద్రపడుదు. ॥కలలో॥

# నైవేద్యం

మధురలో కాళింది నాదం వృందావనంలో వంశీరాగం చేయుచుండ గోవులు సమస్త జీవులు ఆ గానాన్ని తీరని దాహంగా క్రోలుచున్నవి.

గరుడుడు కృష్ణా! అని పిలచుచుండ కృష్ణుని చుట్టుకొని లేగదూడలు నాకుచుండ, దేవకి కుమారుని గురించి విలపించుచుండ మునులు శ్రీకృష్ణుని సేవచేయ తలంచుచున్నారు. ధరలో ధర్మం ఆయాసపడుచుండ కర్మసిద్ధాంతం ప్రయాస పడుచుండ కృష్ణుని రాకకై శాంతమనస్కురాలై రాధాకృష్ణుడు వచ్చునను విశ్వాసంతో ఎదురుచూస్తూంది. లేజిగురుల మార్దవం పుష్పముల సుగంధం మించిన రాధసౌందర్యం కృష్ణునకే నైవేద్యం.

అయినా ఆ ఆనందఫలం అందుటలేదు నయనాలలోని గోలోక సుమం విరియుట లేదు

పల్లవి॥ మధురలో యమునాగానం
వృందలో వంశీరాగం

అను॥ గోపమ్మల ఎదలో ఆనందరాగం
గోవుల మనసుల్లో తీరని దాహం ॥మధుర॥

చరణం॥ కృష్ణా! కష్టా యను గరుడుని పిలుపు
కృష్ణుని చుట్టిన లేగల వలపు
కృష్ణుని గూర్చిన దేవకి వగపు
కృష్ణుని సేవకు మౌనుల తలపు. ॥మధుర॥
ధర్మానికి ఆయాసం
కర్మానికి ప్రయాసం
మర్మంగా నివాసం
శర్మంగా విశ్వాసం. ॥మధుర॥
చిగురుల మృదుత్వం
సుమాల మధురత్వం
రాధా సౌందర్యం
కృష్ణునికే నైవేద్యం. ॥మధుర॥
అయినా అందని ఆనందఫలం
నయినా లంటిన గోలోకసుమం. ॥మధుర॥

# రసమతి

కొమ్మల్లో గువ్వలజంటలవోలె కుసుమాల్లో తుమ్మెదల జంటలవోలె చిత్రఫలకాల్లో బొమ్మలవోలె రాళ్ళలోని శిల్పాలవోలె వుండాలని రాధమ్మ ఆశ.

నారదభక్తి సూత్రాల పోలి ప్రేమపూరిత రాధమ్మనేత్రాలపోలి వాత్సల్యభరిత రుక్మిణి హృదయాన్నిపోలి సమతాసార్వభౌముడు కృష్ణుని గీతనుపోలి వుండాలని రాధ ఆకాంక్ష. సామాన్యులకు గులాబీల్లా భావిలో చెరగని మూర్తుల్లా కలువకు చంద్రునిలా నవ్యతకు రాధాకృష్ణుల ప్రేమలా నిలవాలని రాధ తలంపు. చలనంలేని హృదయంతో ధైర్యంతో నున్న ధరణిగ నియమయుత హితమతిగ ఉన్న రాధ రసమతి కృష్ణుని నమ్ముకొంది.

విశ్వమంత ఆమె పవిత్ర చరిత్ర నిండింది అమలిన అనురాగానికి శ్రీసతి అయ్యింది రాధ.

పల్లవి॥ కొమ్మమీద గువ్వల జంటల్లా
రెమ్మమీద మధుపాయి జంటల్లా

అను॥ చిత్రాల్లో బొమ్మల్లా
రాళ్ళల్లో శిల్పాల్లా. ॥కొమ్మ॥

చరణం॥ భక్తికి నారద సూత్రాల్లా
ప్రేమకు రాధమ్మ నేత్రాల్లా
మమతకు రుక్మిణి మనస్సులా
సమతకు గోపయ్య గీతాల్లా ॥కొమ్మ॥
జనతకు గులాబి పుష్పాల్లా
భవితకు సుందర మూర్తుల్లా
కలువకు చంద్రబింబంల్లా
నవతకు రాధాకృష్ణుల్లా. ॥కొమ్మ॥
నిజమతి ఋజుమతి
వసుమతి ధృతిమతి
వ్రతమతి హితమతి
కృష్ణుని నమ్మిన రసమతి. ॥కొమ్మ॥
అవనిని నిండిన వరమతి
అమలిన చరితకు శ్రీసతి. ॥కొమ్మ॥

# కళోహామ్

వసంతం ధరించిన నును చిగురులు మోముపై నాట్యమాడు చిఱునవ్వులుగ కృష్ణుని సోయగాల నడకలు చూడ యశోదవదనకమలాన అలవిగాని కులుకులు అలము కొన్నవి.

కృష్ణుని తప్పటడుగులకు నందుని మందిరం విందులతో బంధుమిత్రులతో కళకళలాడింది. అంత మురళీరావం నేనేనంటూ అతడెవరనే నేనును ఎరుగమంది. ఆమనిలో ప్రకృతి పురుషుల అందం వర్ణనలకే అతీతం. ఆమె అనగా రాధ (ప్రకృతి) నన్ను పొందవలయుననే తృష్ణతో మోహపరవశ అయ్యింది.

పాపపుణ్యములు భయమునకు హేతువులు. దైవధ్యానం దివ్యాతిదివ్య వంశీరావం మోక్షసాధనం అంటూంది రాధ.

పల్లవి॥ ఆమని తొడిగిన చిగురులు
మోమున నలమిన నగవులు

అను॥ కన్నని బుడిబుడి నడకలు
ఎన్నని యశోద కులుకులు. ॥ఆమని॥

చరణం॥ నందుని భవనము
విందుల తోడుత
చిందులు వేసెను
బందుగు లాడగ. ॥ఆమని॥

మోహన మురళీ
సోహమ్మనుచును
కోహమ్మని యెడి
అహమ్మును ఎరుగు మనె. ॥ఆమని॥

ఆహా! ఓహో! ఆమని
సోహం సోహం సోయగం
సాహం దాహం నందకిశోరం
మోహం మోహం రాధాహృదయం. ॥ఆమని॥

పాపం పుణ్యం భయ్యం భయం
దివ్యం దివ్యం దైవం గానం. ॥ఆమని॥

# ఆలోకము

కన్నయ్యనుగూర్చి యమున తనను అడగవద్దంటే రాధ కృష్ణునితో చెప్పమంది. నందకిశోరుని భావనలు బృందావన సంచారి కాంక్షలు అడగ మంది రాధ.

గోలోకమునుండి రమ్మన్నాడు. ఈ లోకంలో తనను వెదకుకొనమన్నాడు. ఆలోకము నాది. భూలోకము నీది అంది రాధ. నా లోకం ఆనందమయం అని అచట నేను కుసుమంగా శ్రీగంధంగా ప్రకాశింప అతడు సిరులుగ తరుణేందుసమంగా వెలుంగువాడు. నే నిచట అంధకారంలో అతని కోసం కన్నీరు మున్నీరు అగుచున్నాను. వేతసికుంజాలతో యమునా తీరం ఒప్పుతూంది. అట వేణునాదం అపోహలు తొలగిస్తూంది. కాంక్షల కలితులయిన గోపికల నాట్యములు రాధమ్మ శోకాన్ని ఏమని వివరిస్తాయి.

కుండలిని కదలించి గోలోక మార్గమును చూపించిన ఆనందింతు నంటూంది రాధ

పల్లవి॥ యమునమ్మ అంది తనను అడగరాదని
రాధమ్మ అంది కృష్ణయ్యతో చెప్పమని

అను॥ నందకిశోరుని వింతలు
బృందా విహారుని తలపులు. ॥యమున॥

చరణం॥ ఆలోక మొదలి రమ్మనె
ఈ లోకమందు వెదక మనె
ఆలోకమంత నాలోకము
భూలోక మంత నీ లోకము. ॥యమున॥

ఆనందమయము ఆలోకము
ఏనందు సుమము శ్రీగంధము
తానందు సిరులు తరుణేందు సరులు
నేనిందు ఇరులు నీలాల కనులు. ॥యమున॥

యమునమ్మ తీరం వేతసికుంజం
భ్రమలు తొలగించు వేణువు నాదం
కామమ్ము నెరుగని రామల నాట్యం
కోమలి రాధమ్మ కుమిలెడి భావం. ॥యమున॥

కుండలి కదలి గోలోక మేగే
పథమును జూప పోదుర అటకే. ॥యమున॥

# శరణుశరణు

మానవరూపము ధరించిన కృష్ణా! నా భక్తికి మెచ్చి పరవశమున రావలసినది. పరలోకమగు నరలోకమున వుండజాల. మనలోకమునకు పోవుమార్గ మెఱుగను.

నీచరణముల వదలలేను. మరణమునకు భయపడను. కరుణతో వచ్చి శరణ మిమ్ము. ఈ జగతిని ఉండలేను. నీ కర్మ యనిన చేతులు చాచి వేడుకొందును. పరమ పురుషుడు ప్రక్క నున్న నరకమునకైన నడచి రాగలను. చిరకాలమునకు మనలోకము చేరుకొనుటకు సంపదలు అడ్డుకావు. స్త్రీ నగు నేను శిరము వంచి శరణు కోరుచున్నా నని రాధమ్మ వగచుచు పలికింది.

దయతో వచ్చిన నీలో కలిసిపోదును. అని ప్రార్థిస్తూంది రాధ.

పల్లవి॥ పరవశించి వరదరార!
నరుడ వయిన నందగోప!

అను॥ పరుల యింట పండజాల
మరలి పోవు మర్మ మెఱుగ. ॥పరవ॥



చరణం॥ మరణ మనిన మరలి పోను
చరణ మొదలి చనగ లేను
కరుణ గలిగి కానరార
శరణ మొసగి శాంతి నీర! ॥పరవ॥

ధరను నిలువ తరము గాదు
కరమ యనిన కరము చాతు
నరక మయిన నడువ గలను
పరమ పురుష పంచ నుండ ॥పరవ॥

సిరులు భువిని స్థిరము గావు
చిరము తిరిగి చేరుకొనగ
నారినయ్యు నందబాల
శిరము వంచి శరణ మంటి ॥పరవ॥

కరుణ తోడ కదలి రార!
కలసి పోవ కలసి రార! ॥పరవ॥

# దారిచూపేరా?

కృష్ణా! ఈ కృతులను విని నడకుదురు కవిని నన్ను దీవింపుము. సత్కీర్తికి దూరంగా దుష్కీర్తికి దగ్గరగా జీవించలేను.

ఓ కన్నా! నీ కన్న ఎవరూ లేరు నీవు రాకపోయిన నా ప్రాణాలు తీసికొనుము. రాకున్న మీయమ్మ యశోదమ్మకు గాని కన్నమ్మ దేవకికి గాని చెప్పుదును. రేపు మాపు అనిన మార్గదర్శన మైన చేయుము. నేను వచ్చెదను అని అన్న వెన్న పాలు పెరుగులే కాదు, ఈ పేద ప్రాణాలు నీ పాదములకు పుష్పములుగ అర్పించెద. శ్వేత ద్వీపమును పాలకడలిని శేషుణ్ణి వైకుంఠవాసుని మునులను ముందుంచినా ఫలితం లేదు. గోలోక కృష్ణుని చేరినగాని సుఖశాంతులు మోక్షము లభించవు.

ఏమయ్యా బ్రహ్మచారి వయిన నీకు బంధము లేమిటయ్యా అని ఆదిశేషుడే ప్రశ్నించాడు. అతడే నాకు ఈ దివ్య మార్గము చూపించాడు.

పల్లవి॥ ముకుందా! ఈ కృతులను వినరా
నడకుదురు కవిని దీవించరా!

అను॥ దుష్కీర్తిభారమై సత్కీర్తిదూరమై
నేనింక బ్రతుకింక సాగింప లేనురా. ॥ముకుందా॥

చరణం॥ ఓ కన్న! నీకన్న నాకెన్న లేరురా!
రాకున్న అన్నన్న శ్వాసన్న తీయరా
లేకున్న మీయమ్మ యశోదకే చెప్పనా?
వినకున్న కన్నమ్మ దేవకికే తెల్పనా?. ॥ముకుందా॥
రేపన్న మాపన్న దారన్న చూపరా
నేనున్నా ననియన్న వెన్నన్న తెత్తురా
పాలన్న పెరుగన్న ఓ కన్న యీయనా?
పేదన్న ప్రాణాల్ని పాదాల నుంచనా. ॥ముకుందా॥
శ్వేతద్వీపాన్ని చేసన్న చూపినా
పాలసంద్రాన్ని శేషుణ్ణి నిల్పినా
వైకుంఠ వాసుణ్ణి మౌనుల్ని కాంచినా
గోలోక కృష్ణుణ్ణి చేరితే ముక్తిరా!. ॥ముకుందా॥
శేషుడే ప్రశ్నించె వటునకే బంధమా!
శేషుడే చూపించె దివ్యమౌ మార్గమే. ॥ముకుందా॥

# వంశీస్వరాలు

## 2వ భాగం

## శ్రీనివాస సంకీర్తనలు



నడకుదురు. రాధాకృష్ణకవి

## మా స్వామి మహదాశీస్సు

ఏడుకొండల వేంకట రమణుని దయ అపారము అనంతము.

ఆనాడు ఆ అవతారమున ఆబాలగోపాల వ్రజాంగనల హృదయాన తాను తన సుకుమార సుందర మనోజ్ఞ లలితలావణ్య కళాచతురిమను మధుధారల సరిగమలతో సమస్థితిని మేళవించి యమునా తరగల తరంగవిన్యాస లయలను జోడు చేసికొని ఆ బృందావన వీధిలో ఆ మురళీరవాన్ని సర్వప్రకృతులు సారస్వత రసవాహినిలో సమాధినందునట్లు మ్రోగించిన ఆ బాలగోపాల శిఖిపింఛమౌళి వంశీస్వరాలను ఈ శృంగార శ్రీనివాసుడు తన అంతరాంతర సంవిత్కళనచే ఆరోహణము చేసికొని ఆ గ్రంథ సౌరభాన్ని ఆంధ్రావనికి అందించుట మా రాధాకృష్ణకవి భాగ్యము.

ప్రమాధి వైశాఖము

1999

**స్వామి సర్వేశ్వరానంద**

# వంశీస్వరాలు

శ్రీమతి, డాక్టరు, కె. పార్వతి
డా॥ కె. రామమూర్తి
బి–6, రాంనగర్, టి.టి.డి. క్వార్టర్స్, తిరుపతి.

కలియుగం తొలిదశదాటి మలినిశలో తూరుపు గోపురాల కోసం తీరతీరాలు గాలిస్తున్న గ్రహణ కాలమిది. ధర్మం నర్మమైపోయిన నడమంత్రపు కాలయాతన ఇది. ఐహిక ఆవరణంలో వివేకం వేకువై వెల్లువెత్త వలసిన తరుణంలో ఈ రచన ఒక ఆధ్యాత్మిక అరణం. భవసాగరతరణానికి దివ్య చరణమే శరణమని నిర్ద్వంద్వంగా నుతించిన కవితా తోరణం ఈ సంపుటం. నిస్సారపు లౌకిక లంపటంలో లగ్నమైన జీవుల మానసాల్ని జయించి, ఆత్మ భావనలో లయించేలా అనుదాత్త స్వరితంతో నింపటం ఈ రచన లక్ష్యం.

ఐహిక కందరాల్లో, ఐశ్వర్య పంజరాల్లో నిస్సారపు మిడిమేలపు ఘోష, బుద్బుద ప్రాయమైన బ్రతుకుల్ని భ్రాంతిరాహిత్యంతో భగవదర్పితం చేయాలనే అభిలాష, శరణాగతే శాంతికి సోపానమనే స్ఫూర్తి, దీనజనబాంధవుని దివ్య చక్షువులే మోక్షమహస్సును మంత్రించే మహర్లోక మాధవాలనే విశ్వాసపువాదన, ప్రణవపారం చూసిన భక్త హృదయ పరిభాష ఈ కృతికి ఉత్తమాకృతిని నంధించాయి. జగతినంతా జాగృతం చేయాలని పరితపించే యతిలా, వైతాళికునిలా ఈ కవి దర్శనమిస్తాడు.

పద్యరచనలో చక్కని అభినివేశం, పదరమ్యతలో అభిరుచి అభినందనీయాలు. ఇందులోని పదాలు శృతిచేసిన శింజితాలు. దివ్యధ్యాన నర్తనాలు. పరమపదాలకు పరదాలు తొలగించే గోపీతాలు. ఇదొక భక్తిలోక దర్బారు. దివిజోపాసనా దీధితి ఈరచనా జతి. ప్రతిభావన దివిజారావం! భక్తజన హృదయ రంజితం! హరికి, ఒక దివ్యలహరికి హారతులెత్తిన పల్లవీ చరణాలు ఆకాశదీపాలై విహరించే తామసహరణాలు. అజ్ఞానాంధ కారంలో తెరువుకోసం

పరువులెత్తే బాటసారులకు ఈ కీర్తనలు శిఖాతరువులు. పరమాత్మ పావన స్తుతిని భావనా శ్రుతిగా చేసుకున్న ఈ పద్యాలు హృద్యాలై సత్పథాల సన్నిధానాలకు చేర్చే శిష్ట సహవాసాలు!

కవి తనను వంశీమోహనుడి ముందు మోకరిల్లిన ప్రకృతిగా మలచుకున్నాడు. "వంశీ స్వరాలు" వేణువనాలైతే, రాధాకృష్ణుని కవనమంతా 'మధురా' పవనమైతే, రసహృదయాలన్నీ రాధికలే! యమునాతీర వేదికలే! సాంధ్య సానువుల్లో వంశీ వేణువులన్నీ సంపెంగల సరాలు దాల్చిన సంతప్త మధుర మూర్తులై కరాలు మోడ్చి సనాతనుని సంగాతం కోసం కలవరిస్తాయి. పరమపురుషుని చరణాలకు అలదిన చందనమై చెమరించి పోవాలని. అధరాలపై ప్రణవమై రవళించాలని, నేత్రాలలో స్వచ్ఛతై ధవళించాలని కవి గుండె లోతులనుంచి ఎగజిమ్ముకుని వచ్చిన ఒక అనుభూతి కెరటపు తాకిడి ఇది. అనంతశక్తి స్వరూపునిపై అతివేలమైన తమకం ఇది. నగధరునికి నరుని నజరానా ఈ కవితా నీరాజనం! మధురభక్తి ఘోషను భక్తహృదయ భాషగా ఆలపించిన జీవన్ముక్తుడు ఈ కవితా వైణికుడు.

ఈ రచనా రాసమంతా ఆముష్మిక వనవిహారమే! మన ఆశ, శ్వాస, ఉవాచ భక్తిమయం కావాలనీ, కలతబారిన జీవితాలకు కేశవుని కైంకర్యమే అనునయ మవుతుందనీ, జీవుని బాంధవ్యమంతా ఆపద్బాంధవుని తోడిదే కావాలనీ, సంస్కార సిందూరాన్ని దేవకుసుమ పరాగంలా మనసంతా హత్తళించుకోవాలని, వేదనాదాన్ని మేఘరాగంతో మేళనం చేయాలనీ ఒక సురలోకపు స్వప్నాన్ని సాక్షాత్కరింపజేయాలనే కవిసాధన, అందుకోసం సాధిష్ఠమైన కావ్యసృజన కోసం సమధిక శోధన - వెరసి సరసిజనాభుని సారస్వతమైంది.

కవాతు చేసే కులాల సతమతాలు, శతమతాలు అజ్ఞానపు అతిశయాలనీ, ఆశాపాశాలు ఈశావాస ప్రవేశ క్లేశాలనీ, కోరికలు తామసపు తలవాకిళ్ళనీ, సంపదలు మిడిమేలపు మిడినాగుల తాకిళ్ళనీ తలపోసి - భూజాని గురించిన భావనే సంభావనగా, స్వామి భక్తి అనంతశక్తిసూత్రంగా, సత్కర్మ దివ్యధర్మ ప్రసారంగా, తత్త్వసత్యసాధనే మోక్షాల సాక్షాత్కారంగా, తీర్థ సంచారం కంటే నిస్స్వార్థ జీవనమే విశ్వకిరణ ప్రసరణను అందుకునే ఆలయంగా, హృదయ నైర్మల్యమే ఉషస్సుకు ఊపిరిపోసే ఉరవడిగా కవి విశ్వసించిన తీరు విశ్వజనీనం.

పరమేశుని సృష్టిలో, శరణాగత వత్సలుని అనంత కరుణావృష్టిలో ఇంత ఆక్రందన, ఆక్రోశం, ఇన్ని కన్నీళ్ళు, కలతలు, అన్ని దయనీయపు అనవాళ్ళు ఎందుకున్నాయని కవి తల్లడిల్లడం, సాటినరుని నయనం చెమ్మగిల్లినంతవరకూ వరాల స్థావరాల సింహద్వారాన్నైనా తాను సమీపించలేనని, దీనులంతా అజ్ఞానపు తిమిరంలో వెలవెలబోతున్న భానులనీ, బాధాతప్త హృదయాలను, వేదనాభరిత ఆత్మలను ఆదుకొమ్మని, చరాచరాలకు తరతరాల వరకు తోడ్పాటునిచ్చి తరింపజేయమని దీనజన ప్రతినిధిలా త్రిధాముణ్ణి వేడుకోవడం కవి హృదయ ఆర్ద్రతకు, ఔన్నత్యానికి తార్కాణం.

రోదసి రెప్పలు విప్పారిన వేళ, వేకువద్వారాలు తెరచుకుని వంశీసంస్తుతి వినువీధుల్ని, వెండికొండల్ని, విష్ణుపదాల్ని దాటి ధాత్రిని చేరి ఆధ్యాత్మిక ఋతువై, ఆత్మ నివేదనగా క్రతువై అవని అణువణువూ వేణువై రవళిస్తుంటే, మన భూములన్నీ విశ్వంభరుని అనురాగ వరాగ రేణువుల రసవాహినిలో మోహితులై పావనమవుతున్న ఒక అనుభూతి మనలో స్వప్నమై సాగుతుంది!

ఈ కవితా వంశధార కవి ఆత్మానందభరిత హృదయ ధారాధరం వర్షించిన వైదిక ఝరి. వ్యక్తిలోని భగవదంశను వెదికి తీసే ఉపదేశం! సిరిగిరుల నుంచి కదలి వచ్చిన హరుని వర్చస్సు నరుని నరనరాల్లో లయించిన లాహిరిలో కవి మధుర హృదయం చేసిన పదలాస్యం ఈ బృహత్ భాష్యం. భక్తిరస గంగా వాహినిలో కవి తాను తడిసి, తనిసి తన్మయంతో తమకించి గమకించిన ఉత్తుంగ తరంగపు ఆనంద తాండవపు తాకిడి ఈ కవితా వివశత్వం! ఈ కవితా తీర్థంలో అభిషిక్తులైన వారికి స్వార్థం శమించి, జీవన పరమార్థం స్ఫురించి జన్మ సార్థకమవుతుంది. తమిస్రలో, తర్షణతో తల్లడిల్లే వారికి ఈ కృతి జాగృతినిచ్చే హరివిల్లై, అమృతపు జల్లై అలరారుతుంది. భక్తివనంలో బృందదీవిలా, బృందారక బృందగానంలా, మధుసూదనుడి మెడలో మంజిష్ఠ మందార హారంలా ఈ కావ్యం అందగించగలదు.

తిరుపతి

4-6-1999

డాక్టరు, కె. పార్వతి

డాక్టరు, కె. రామమూర్తి

# సుధాశ్రీనివాసం

అనురాగం ఆత్మీయత అర్పణభావం సమతాదర్శనం సత్యసందర్శనం సమధర్మం సకలజీవాంతరాత్మలు మమాంతరాత్మలే యను సౌభ్రాతృత్వం మోహభంజనం సర్వాంతర్యామి యయిన శ్రీనివాసహృన్నివాసం భగవద్భక్తికి మోక్షప్రాప్తికి కారణములేమో.

వీటిని సాధించుటకు సనకసనందనాదులు శుకశౌనకాదులు మహాభక్తవరేణ్యు లెందరో తపించి తపించి తరించారు. ఆధ్యాత్మికతత్త్వవేత్తలు భాగవతాది పురాణములు భక్తులను నవవిధములుగ విభజించుట జరిగింది.

భగవత్ప్రాప్తికి భక్తిని మించిన సాధనం లేదని నారదోద్ధవులు గోపికలు మొదలగు మహనీయు లెందరో నిరూపించారు. కలియుగమునందు తులసీదాసు, సూరదాసు, మీరాబాయి, రామదాసు, త్యాగరాజు, అన్నమయ్య, క్షేత్రయ్య మున్నగు భక్తశిఖామణులు భగవత్సేవలో ఐహికమును మఱచి తన్మయత్వంతో గానామృతమును ప్రవహింప జేసి యర్చించి రూపరసామృతపానం జేసి అంతా బ్రహ్మమయంగా భావించి యలౌకికానంద సామ్రాజ్యంలో విహరించి అరిషడ్వర్గములను ఈషణాత్రయములను భౌతికానందసంపదలను త్యజించి పరమానందపదంబగు తురీయానందమును అందుకొన్నారు.

భౌతికసంపద లన్నియు నశాశ్వత మని తలంచారు. అలౌకికానందప్రాప్తికై క్షణకాలము గూడ వ్యర్థము గాకుండ పరానందప్రాప్తికి సాధనజేసి యోగసాధనలో నిత్యానందమును గూర్చు సత్యమును దర్శించి సర్వం అశాశ్వతమన్నారు.

'వంశీస్వరాలు' రెండవభాగంలో ఈనాటి మానవహృదయాంతస్థిత అనేకా లోచనలకుఆకృతి లభించవచ్చు. శ్రీనివాసుని రూపమాధుర్యంలో ఓలలాడి శ్రీనివాసం చేసికొన్నారు హృదయాన్ని పరమభక్తులైన ఆళ్వారులు. శాశ్వతాశాశ్వతములను దర్శించారు. శాశ్వతాన్ని స్వీకరించారు. జీవితం పుష్పించి ఫలించిందని ఆనందడోలలలో మైమఱచి పోయారు. కులమతాలకు అతీతులయినారు. నేటి సమాజంలో అవి లోపించి స్వార్థం పాతాళమును తాకింది.

శ్రీనివాససంకీర్తనలలో ఒకచోట భగవంతునకు సమర్పించుకొనుటకు కుసుమములు సమకూర్చాడు భక్తుడు. కాని తుమ్మెదలు వాటిపై ముసిరాయట. అప్పుడు క్రోధోద్విగ్నమనస్కుడైన భక్తుని భావం చూడండి.

"దుసికిలక దాచాను దొంతర్ల మల్లెలూ
ముసిరాయి భృంగాలు మూచూడ గంధాలు
కసిరాను కోపాన కాపాడు కాంక్షతో
విసిరాను పుష్పాలు వేంకటాచలునిపై"

శ్రీనివాసా! నేను అజ్ఞానంతో ఆత్మపరమాత్మ ఒకటే యను విషయము విడచి స్వార్ధంతో ప్రవర్తించాను ఆత్మలను తెలిసికొనలేకపోయాను నీకు దూరం అయ్యాను. నన్ను క్షమించి అక్కునచేర్చుకొని రక్షించ మని అంజలించాడు.

ఇంకొకచో

"భవిలోన నెటువంటి బంధాలు వద్దయ్య"

అని ప్రాధేయపడ్డాడు. నావంటివాడు మోసపూరితమైన ఈలోకంలో సంచరించుట కష్టమని కోరాడు. మంచివాడైన ప్రతివాడు దానినే కోరుకొంటాడు.

మరియొకచో

"దారి తెన్ను లేక దారిద్ర్య మందెడి
వారి కోసమై వచ్చాను నీ దరికి" అన్నాడు.

నాకై కాదు అక్కటికమున అలమటించుచున్న ఆర్తులకై వారి బాధలను తొలగించ మని నిన్ను అడగటానికి వచ్చాను. అంతేకాని! నాకై కాదు. కాని! నేను ఎవరికోసం వచ్చానో వారిలో నేనుకూడ ఉన్నానేమో?

మరియొక సంకీర్తనలో

"అన్నమయ్య పాటి యాదరించ లేవ?
చిన్నమయ్య యనుచు చీదరించు కొనక"

అని వేడాడు. ఈ విధంగా వంశీస్వరాలులో వినీతు దయ్యాడు. మీ ముందు గ్రంథముంది పరిశీలించండి.

శ్రీనివాస సంకీర్తనల రచన తలవని తలంపుగా నాహృదిలో చోటు చేసికొంది. వంశీస్వరాలు ప్రథమభాగమును విని ఆనందించి వాటికి చిత్రరచన చేసిపెడతానని ఉత్తమసాహిత్యాన్ని చవి చూశానంటూ రెండవ భాగము శ్రీనివాస సంకీర్తనల రచనకు

ప్రోత్సహించారు పణితపువారు. వారి ప్రోత్సాహఫలం శ్రీనివాస సంకీర్తనం. 'చిత్ర కళావిశారద' బ్ర॥ వే॥ పణితపు నాగేశ్వరరావుగారు వంశీస్వరాలు రెండు భాగములకు చిత్రరచన చేశారు. శ్రీ నాగేశ్వరరావుగారు వారి కుమార్తె చి॥ల॥సౌ॥ గుంటముక్కల విజయ ముఖచిత్రము లోపలి చిత్రములు చిత్రించారు. తండ్రి కుమార్తె లిరువురకు కృతజ్ఞతాంజలులు సమర్పించుచున్నాను

శ్రీనివాస సంకీర్తనలకు తమ అమూల్యాభిప్రాయము వ్రాసి యిచ్చిన శ్రీమతి డాక్టరు కలువగుంట పార్వతి, ఎం.ఏ.పిహెచ్.డి. గారికి, నాకు గ్రంథ ముద్రణలో సహకారమందించిన డా॥ కలువగుంట రామమూర్తి గారికి కృతజ్ఞతాభివందనములు చేయుచున్నాను.

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము, తెలుగు శాఖాధ్యక్షులుగా పదవీ విరమణ చేసిన సాహితీవేత్త, ప్రొఫెసర్, మన్నవ భాస్కరనాయుడుగారికి చి॥ జి. చెన్నకేశవ నాయుడు ఎం ఏ.ఎం ఫిల్‌గారికి గౌరవపూర్వక నమస్సుమాంజలి ఘటించుచున్నాను వారి సహకారము పీయూషతుల్యం

ఈ కృతిని 'వంశీస్వరాలు' 1,2 భాగములను ఉత్తమ శ్రేణిసాహిత్యముగా గుర్తించి పిపీలికాది బ్రహ్మపర్యంతము నిండియున్న కలియుగ దైవము కళ్యాణ వేంకటేశ్వరుడు ఇతోధికముగా సుమారు రు 20/- వేల పురస్కారమందించినాడు. ఆ తిరుమల స్వామికి నతమస్తకుడనై సాష్టాంగపడుచున్నాను

నాకు అనునిత్యము కంటికి రెప్పగానుండు సోదరుడు చి॥ నడకుదురు బాబూరావు దంపతులకు నా అనుంగు సోదరి చి॥ల॥సౌ॥ వెంట్రప్రగడ రాజ్యలక్ష్మీశర్మ (రాజేశ్వరి) దంపతులకు అభినందనలు అందించుచున్నాను

ఈ కృతికన్యను సర్వాంగసుందరముగ ముద్రించిన వాసవి ప్రింటర్స్ అధినేత లయన్ బి. సాంబశివరావుగారికి నమస్సులు అందించుచున్నాను

ప్రమాధినామ సంవత్సర వైశాఖము

దీ, 31-5-99

రచయిత

**యవ్. రాధాకృష్ణకవి**

1

కళ్యాణశ్రీనివాసా! పద్మావతిని వలరించువాడవు నీవు. కొండపై నున్న నీపాదాలను భక్తిప్రపత్తులతో సేవింప నిమ్ము. వాసన చెడకుండ దోసిట్లో దాచిన కుందపుష్పములు నీపై చల్లనీయుము.

రసరాజా! శరణమంటిని. నడకుదురు రాధాకృష్ణకవిని నన్ను రక్షింప మని ప్రార్థించుచున్నాను.

పల్లవి॥ కలియుగదైవమా! కళ్యాణవేంకటేశ్వరా!
కలిమిచ్చి కరుణించరా కనుపించరా! ॥కలి॥

చరణాలు॥ పద్మావతీ చరణాల పారాణివై
పద్మాక్షి యలమేలు పలుకుల చిలుకవై
పద్మాల సరసికీ పద్మబాంధవుడవై
పద్మాల పాదాల పదనిసల పాడనీ. ॥కలి॥

కొండెక్కి కూర్చున్న కుదురైన చరణాలు
నిండైన నీరూపు నీలాల నీకురులు
పండినా బింబాలు పరువాల యధరాలు
మెండైన భక్తితో మెండుగా వేడనీ. ॥కలి॥

దుసికిలక దాచాను దొంతర్ల మల్లెలూ
ముసిరాయి భృంగాలు మూచూడ గంధాలు
కసిరాను కోపాన గాపాడు కాంక్షతో
విసిరాను పుష్పాలు వేంకటాచలునిపై. ॥కలి॥

సాధనీయుడ శరణ మంటి నయ్య
రాధాకృష్ణుణ్ణి రసరాజ ప్రోవరా! ॥కలి॥

(2)

ఏడుకొండలస్వామీ మిమ్ము క్షణము కూడ మరవను ఎచ్చట ఎప్పుడుందువో ఏ వాంఛలేక యిచ్చు పూలతో నన్ను స్వీకరించుము నీవు కాదనిన నేను రాలిపోదును బెట్టు చేసిన మిమ్ము విడువను భువిలో భక్తులు భూతములుగారు

నాకు నెటువంటి బంధములు వద్దు. నీయండ యున్న చాలు స్వామీ

పల్లవి॥ సప్త గిరులపైన శయనించు నాసామి
లిప్తకాలమైన సుప్తుండ గానురా! ॥సప్త॥

చరణాలు॥ ఏజీవి చెంతను నేవాడ నుందువో
ఈజీవి నీ చెంత నేకాంత సేవలో
పూజింప బుష్పాల బుణ్యాల గోరకే
నాజన్మ నీకంచు నాపూజ గొనమంది. ॥సప్త॥

మట్టిలో బుట్టినా మాణిక్య మైనాను
జెట్టి వైనా నిన్ను జేపట్ట దలచాను
రట్టుసేయ నేను రాలిపోదు స్వామీ
బెట్టుసేసి తేను విడువలేను దేవ! ॥సప్త॥

రవణించు కలువల రాయడా జాగేల
భువిలోన భక్తులు భూతాలు గారయ్య
భవిలోన నెటువంటి బంధాలు వద్దయ్య
చివురించు భాగ్యమ్ము చిఱుజన్మ కేలయ్య! ॥సప్త॥

కైదండ నాకిచ్చి కనవయ్య మహనీయ
రాధాకృష్ణుణ్ణి రసరాజ బ్రోవరా. ॥సప్త॥

(3)

పేదను, ప్రేమతో కష్టాలు తొలగించరా వెంకన్న! ఆపదలు భరించ జాలను.

స్వామి! అప్పుల బాధల్లో మున్గావా? లోకాన్ని ఋణగ్రస్తం కావలదని హెచ్చరించుచున్నావా దేవా! భక్తితో నాకనుల నుండి నీరు కారుచుండ జూడ రమ్ము స్వామీ! సుగంధభరిత మొల్లసుమములను సమర్పింతును.

కధగా మిగిలిన నేను కవిగా చిన్నోణ్ణి. రసమూర్తీ యీ రాధాకృష్ణుణ్ణి కరుణించు శ్రీనివాసా!

పల్లవి॥ ఏమిరా వెంకన్న యీ భంగాలు
ప్రేమతో దీర్పరా పేదోణ్ణి బ్రోవరా! ॥ఏమిరా॥

చరణాలు॥ అప్పుల బాధతో నదరు పడుచున్నావా?
ముప్పుల బోధింప మున్గావ యప్పులో
తప్పని తెల్పగా దారి చూపు చున్నావా!
గొప్పకై ముప్పులు కోరరాదన్నావా! ॥ఏమిరా॥

దండాలు పెట్టెద దాగక వేగరా
నిండారు భక్తితో నీలాలు జారగా
పండారు వెన్నెల్లో బండుటాకును గాగా
నిండైన రూపంలొ నినుజూడ లేనుగా. ॥ఏమిరా॥

నల్లనీ నినుజూచి నల్లగలువలు విచ్చు
చల్లనీ గంధాలు జల్లులై వర్షింప
ఉల్లమ్ము తనియంగ నుత్పుల్ల నయనాల
మొల్లల తావుల్లో మురియంగ మునుగంగ. ॥ఏమిరా॥

గాధగా మిగిలిన కవితల్లో చిన్నోణ్ణి
రాధాకృష్ణుణ్ణి రసరాజ బ్రోవరా! ॥ఏమిరా॥

④

గరుడాద్రి శేషాద్రి నారాయణాద్రి మున్నగు నాఱు కొండల కావలా వైకుంఠము స్వామి! పద్మావతీపతివైన నీవున్నది యచ్చటేనా? కారణాంతరములచే నీవు జన్మల పండించుటకై భూలోకమునందు నవతరించితివా స్వామి!

కవిని రాధాకృష్ణణ్ణి పాలించు భారము నీది స్వామి!

పల్లవి॥ అదియే వైకుంఠము అల్లదియే కలివైకుంఠము
ఇదియే శేషాచలము ఇదియే గరుడాచలము ॥అదియే॥

చరణాలు॥ పద్మావతీచరణ పారిజాత మదుగో
పద్మాల నయనాల పావనుండదుగో
ఛద్మాల నడగించు సామజుండదుగో
పద్మాల పాదాల బరగు వాడదుగో ॥అదియె॥

కారణజన్ముడై కదలు వాడదుగో
గారాల భోగాల రసికుం డదుగో
భారాలు తొలగించు కారుణ్యు డదుగో
పారమ్ము జేర్చెడి పరమాత్ము డదుగో. ॥అదియే॥

కుంభాలు నిండించు కోనేటి వాడదుగో
దంభాలు పోజేయు దాక్షిణ్యు డదుగో
స్తంభమ్ము ఛేదించి తనియించు వాడదుగో
కుంభిని న్వెలసిన గోవిందు డదుగో ॥అదియే॥

కవినిర కృష్ణకృతిని గొనర
కవినిర రాధాకృష్ణణ్ణి కవిరాజ ప్రోవరా! ॥అదియే॥

**స్వామి! అలమేలుకు బాదపూజ చేసెదను. ఎక్కడా తల్లి.**

ప్రాణ పుష్పాల పూజింతును. శ్రీశ్రీనివాస! నా హృదయం నీది. పాడు సంసార సాగరము వలదు చేయి జారుట కాముని విలాసము. వరద! వేగముగ వచ్చి స్వీకరించుము

బాధలు వాదులు వలదు. రసరాజు వైన నీవు రాధాకృష్ణుణ్ణి చేకొనుము

పల్లవి॥ అలు ఏదిరా? యలమేలు ఏదిరా!
కాలు మ్రొక్కెద తల్లికాలు మ్రొక్కెద ॥అలు॥

చరణాలు॥ ప్రాణ మిత్తురా ప్రాణ పుష్ప మిత్తురా
జాణ కానురా నెఱజాణ కానురా
గౌణ మెరుగరా కార్య మరయురా
వీణవంటి యెదద వేంకటాపతిదిరా. ॥అలు॥

కడలిలోన నేను నీద జాలరా
గుడిని జేరి నిన్ను గొలువ లేనురా
కడలు నిండి నీవు కలువ రావెరా
సుడిని బడిన నేను జూచు టెట్లురా. ॥అలు॥

కరము ప్రిదిలి పడుట కంతు వింత లనుచు
వరము లెందు కయ్య పరము చేర్చుకొన్న
స్థిరము గాదు జన్మ చెలిమి కన్న నెన్న
వరద వడిగ రార పాల కడలి విడచి. ॥అలు॥

బాధలూ యేలయ్య వాదులూ వద్దయ్య
రాధాకృష్ణుణ్ణి రసరాజ ప్రోవరా! ॥అలు॥

6

ఓంకార రూపుడవైన నీవు పద్మావతికి నోలి యిచ్చినా లేకున్నా ఆమె నీదే. కొండలలో నున్నా బండలలో నున్నా గోలోకవాసుడ వీవు నీవు పిలువకుండగనే యందఱు వచ్చుచున్నారు నిలువుదోపు లిచ్చుచున్నారు శబరి యెంగిలి గైకొన్న నీకు కట్నకానుకలా? నేను నమ్మను

వేదనను చెప్పుకోని జ్ఞానినైన రాధాకృష్ణకవిని ప్రోవుము

పల్లవి॥ ఓంకారివైనా యొయ్యారివైనా
ఉంకువ యిచ్చినా యువిద నీదేరా! ॥ఓంకా॥

చరణాలు॥ కొండలలో గొలువైనా
బండలలో బడియున్నా
కుండలలో గూర్చున్నా
కొండికసామివే (గ) కొండలరాయ! ॥ఓంకా॥

కొండెక్కు వారంత కోరితే వచ్చారా?
గుండెల్లో నిన్నెంతో గుదిగుచ్చు కొన్నారా?
పండింప బ్రతుకంత భావించి వచ్చారా?
బెండైన కట్నాన్ని ప్రేమతో గొన్నారా! ॥ఓంకా॥

నిలువు దోపిడి నీకె నిర్ణిద్రరూప
చెలిమితో నెంగిల్ని జీర్ణించు కోవ
చిలిపివై మిత్రుల చేతుల్లొ ముద్దల్ని
చెలువొప్పు తిన్నట్టి చిన్మయా! కట్నాల. ॥ఓంకా॥

వేదనలు చెప్పలేని వివేకి నయ్య
రాధాకృష్ణుణ్ణి రసరాజ ప్రోవయ్య! ॥ఓంకా॥

(7)

**దేవాదిదేవా! నీరూపం మధురాతి మధురం కంజాత కోమలం.**

దేవతాగణములచే ప్రార్థింపబడు నానందరూపం నీది. కన్నులలో గూర్చొని యెవరికి గనుపించనిది యెవరు చూడలేనిది మీ దివ్యరూపం తిరునామములతో నొప్పు తేజోరూపం మీది.

కథలకు గవిత్వానికి లభించని మీకాంతి రాధాకృష్ణుణ్ణి తనలో లయం చేసికొంటుంది

పల్లవి॥ మంజుల మంగళ మాధుర్య రూపం
కంజాత కోమల కమనీయరూపం. ॥మంజుల॥

చరణాలు॥ కారుణ్య తారుణ్య కారణ రూపం
చారణ సేవిత సౌందర్య రూపం
వారణ ప్రార్థిత వరదుని రూపం
దారిద్ర్య గుణముల దలగించు రూపం. ॥మంజుల॥

కన్నుల వెన్నెల గాయించు రూపం
మిన్నుల కాంతుల మెలగెడి రూపం
చిన్నెల జూపించు చింతిత రూపం
కన్నుల గూర్చున్న కనలేని రూపం. ॥మంజుల॥

తిరుమణి దిద్దిన తీరైన రూపం
తరుగని కళలకు దావైన రూపం
చిరతర దీపిత శ్రీరంగరూపం
తిరుమల వెలసిన తేజోరూపం ॥మంజుల॥

గాథల కందని కవితల రూపం
రాధాకృష్ణుని రసరాజ రూపం. ॥మంజుల॥

(8)

ఓ వేంకటేశా! నీవు సర్వాంతరాత్మవు. వృందకు లోకములకు నానందము కలిగించు పుణ్యాంతరాత్మవు.

బ్రహ్మ నుండి సర్వజీవజాలంలో నిండియున్నవాడవు మునిజనుల యందు భూలోకము నందలి సర్వజీవులయందు నిండియున్న వాడవు నీవు కలియుగంలో దిరుమలలో వెలసిన రాజాధిరాజవు నీవు

వేదార్థములలో నిండియున్న నీవు నన్ను పాలించెదవని నాతలంపు దేవా!

పల్లవి॥ సదానంద చిదానంద సర్వాంతరాత్మ
ముదావృంద ధరానంద పుణ్యాంతరాత్మ! ॥సదా॥

చరణాలు॥ సురలోక నరలోక సూక్ష్మాంతరాత్మ
పరలోక వరలోక బ్రహ్మాంతరాత్మ
చిరరత్న స్త్రీరత్న జీవాంతరాత్మ
కరిరత్న కృతరత్న కావ్యాంతరాత్మ! ॥సదా॥

మునిలోక హృల్లోక ముదితాంతరాత్మ
జనిలోక మృదులోక జాత్యంతరాత్మ
ఫణిరాజ సుమరాజ పాదాంతరాత్మ
మణిరాజ భూరాజ మహితాంతరాత్మ! ॥సదా॥

కలియుగ చరయుగ కామాంతరాత్మ
కులయుగ నటయుగ కుసుమాంతరాత్మ
బలయుగ మణుయుగ బాధాంతరాత్మ
తిలయుగ తులయుగ తీర్థాంతరాత్మ! ॥సదా॥

వేదార్థభాసిత విశ్వాంతరాత్మ
రాధాకృష్ణఙ్ఞి రసరాజ బ్రోవరా! ॥సదా॥

సౌందర్యమునకు ప్రతీకలైన నీనయనాలు సిరులిచ్చును.

భక్తుల రక్తుల ముక్తుల మోహింపజేయు కనులు నీవి. సుధామయము సుగంధమయము అయి గోదాదేవిని లోగొన్న కనులు నీవి నీ నేత్రములను గోపికలు గూడ నారాధించినారు.

జ్ఞానబోధతో రక్షించు నేత్రములు నీవి రాధాకృష్ణకవిని ప్రోచుకనులు నీవి శ్రీనివాసా!

పల్లవి॥ సిరులిచ్చు కనులు శేషాద్రి కనులు
సరిలేని కనులు సౌందర్య ధునులు ॥సిరు॥

చరణాలు॥ భక్తులు భక్తితో భజయించు కనులు
రక్తులు రమియించు రమణీయ కనులు
శక్తులు చెలగుచు క్షమియించు కనులు
ముక్తులు మోహించు మురిపాల కనులు. ॥సిరు॥

మత్తును గలిగించు మాధుర్య కనులు
బిత్తరి రగిలించు పీయూష కనులు
కత్తురి గందాలు కరుణించు కనులు
పుత్తురి బామకు బొందైన కనులు. ॥సిరు॥

గోపిక లాటకు గురుతైన కనులు
గోపులు కొలిచెడి గోవిందు కనులు
తీపులు కురియించు తీరైన కనులు
రూపులు దిద్దెడి రోచిష్ణు కనులు. ॥సిరు॥

బోధలు చేసెడి పుణ్యాల కనులు
రాధాకృష్ణుణ్ణి ప్రోచె రసరాజ కనులు ॥సిరు॥

(10)

**కలికి పద్మావతి కాంక్షలు దీర్చినవాడే కోనేటిరాయుడు, వైకుంఠవాసుడు.**

భక్తుల వందనముల గ్రహించి సంతస మందువాడు తిరుమల వాసుడు. శ్రీనివాసునితో ననుబంధము తిరువారాధనమే మాధవ! వరముల నిమ్మని యడుగను ప్రాణము స్థిరము గాదు.

కళ్యాణమూర్తీ కాలము తీరింది రాధాకృష్ణకవిని రక్షింపుము.

పల్లవి॥ కలికి చకోరికి గామిత మిచ్చె
వలపుల రాయడె వైకుంఠ ధాముదు ॥కలికి॥

చరణాలు॥ వందారు భక్తుల బందాలు చూచి
మందారమై విరిసి మాటాడ గోరి
బృందారకగణముల విందులు గాంచి
హిందోళరాగాల హృష్టి నొందే సామి! ॥కలికి॥

తిరుమణి నామం తిరుచూర్ణ నీమం
తిరుముడి వరముడి తిరుకాపు వేషం
తిరువారాధన తిరుమాళిగ వాసం
తిరుమల వాసుని దివ్యాను బంధం ॥కలికి॥

కరములు ముడిచి కన్నులు తెఱచి
వరముల నిమ్మని వాగను సామీ!
భరమౌలోకము వాడిన దేహము
మరలెడి ప్రాణము మసలెడి మరణము
మరలగ గోరెద మాధవ కొనర. ॥కలికి॥

కాదా కాలము కళ్యాణ మూర్తీ!
రాధాకృష్ణుణ్ణి రసరాజ ప్రోవరా! ॥కలికి॥

(11)

స్వామి! తిరుమజ్జనమునకు దీర్థాలు వచ్చినవి. శయ్యపై నుండి దిగిరమ్ము.

పద్మావతిని బ్రహ్మదేవుని విడచి రమ్ము గోవులపాలు నేయి పెరుగు మున్నగు ద్రవ్యము లన్నియు వచ్చినవి సేవకులందరు వచ్చియున్నారు లీలావిలాస! ప్రభాతసేవకు విచ్చేయవలసినది మీరు

మీ పాదసేవకు రాధాకృష్ణకవి సిద్ధముగ నున్నాడు తిరుమలదేవ దయ చూడుము

పల్లవి॥ తిరుమజ్జన సేవకు దీర్థాలు వచ్చె
తిరుమల సామీ దిగిరా పర్యంకము. ॥తిరు॥

చరణాలు॥ పద్మావతీ వక్షంపు బద్మాలు విడచి
పద్మపు దీగైన పడతిని విడచి
పద్మాల కాంతుల పద్మనేత్రాలతో
పద్మనాభుని వీడి పరగ రావయ్య! ॥తిరు॥

గోవులు పాలిచ్చె గోవింద నీకై
గోవుల నేయి వచ్చె గోపాల నీకై
గోవుల దధివచ్చె గూర్చుంటి వేమో
రావయ్య పురినుండి రాజీవ నేత్ర! ॥తిరు॥

సేవకు లెల్లరు చేరె కొలువంగ
సేవలో మునుగంగ సిద్ధమైనారంత
పావన మైనట్టి ప్రాభాత సేవకు
లేవయ్య రావయ్య లీలా విలాస! ॥తిరు॥

వాదాలు వద్దయ్య పాదాలు పట్టెద
రాధాకృష్ణుణ్ణి రసరాజ ప్రోవరా! ॥తిరు॥

(12)

**తత్త్వజ్ఞానియే యాళ్వారుగాని కులమతాలతో కొట్లాడు వాడుకాదు.**

దివ్యమంగళ రూపాన్ని తనవైపు త్రిప్పుకొని శరీర జ్ఞానము లేక శ్రీరంగని సేవించిన తత్త్వజ్ఞాని తిరుప్పాణి ఆళ్వారు కులమతాతీత భక్తియే భగవంతునితో సాయుజ్యము గలిగించు నని బోధించిన మహాత్ముడాతడు.

అట్టి వారికి సాన్నిధ్య మిచ్చిన శ్రీశ్రీనివాసుడు రాధాకృష్ణకవిని తప్పక దరి జేర్చుకొనును

పల్లవి॥ తత్త్వజ్ఞానియై తపమును జేసి
తత్త్వము దెలిసిన తాపసె యాళ్వార్. ॥తత్త్వ॥

చరణాలు॥ దివ్యమంగళ తేజోరూపము
నవ్యదృష్టిని నవముగ జేసి
సవ్య మౌనటు సామము పాడి
హవ్యము జేసిన హరిపద దాసుడె. ॥తత్త్వ॥

శ్రీరంగమందున శ్రీరంగనాథుని
సారంగి మీటుచు సదమల భజనల
శారీర జ్ఞానపు జైతన్య మెఱుగక
దారువు విధమున దనిసెను తిరుప్పాణి. ॥తత్త్వ॥

ఒకే చూపున నున్మత్తు భంగి
యొకే తలపున నూగుచు బాడే
యొకే దేవుడు నొకటే తలపు
ఒకే సంస్కృతి యుండే దొకరనె. ॥తత్త్వ॥

బాధాజగతని బాగుచేయమనే
రాధాకృష్ణుణ్ణి రసరాజ! ప్రోవరా! ॥తత్త్వ॥

(13)

నిందాస్తుతులను సమానముగ మల్లెమొగ్గలను చూచునట్లు చూచువాడు భక్తుడు

నిజమైన భక్తునకు భార్యాబిడ్డలు ఇల్లువాకిలి యను తాపముండదు అన్నింటిని తన యాత్మరూపముగ తలంచువాడే పరమాత్మను దర్శించువాడు తిరుప్పాణిని నంత్యకులజు దని తలచు ద్విజుడ ననుకొను నేను నంటరాని వాడను. నాకంటె ఛండాలుడు లేదు

ఆనంద సామ్రాజ్యాధిపతియై శ్రీపతి రాధాకృష్ణకవిని ఉద్ధరించును

పల్లవి॥ నిందాస్తుతులను నిర్మల మతితో
కుందము చందము గొలుచును భక్తుడు. ॥నిందా॥

చరణాలు॥ అనికేతనుడై యనుభూతుల మను
వినీతుడై చను వెలుగును తిరమతియై
వినయభక్తుడై వేంకటపతి హృదిలో
అనయము నిలచెడి యతడే నా సఖుడు. ॥నిందా॥

ఆత్మమువలె సర్వజీవు లన జాలని నేను
ఆత్మలోపల బరమాత్మను నెటుల
ఆత్మేశ్వరుడని యనుకొన జాలుదు
ఆత్మలోగనె నాపరమాత్మ నా తిరుప్పాణి ॥నిందా॥

అంత్యకులజుడని యనాదరించీ
అంత్యకులజుడ నయితిని నేను
చింత్యము ద్విజుడన జెల్లునె నాకు
అంత్యజు డైననను నతడే యవనీసురుడు. ॥నిందా॥

మోదం బందుచు మురిసెడి శ్రీపతి
రాధాకృష్ణుణ్ణి రసరాజై ప్రోచురా! ॥నిందా॥

(14)

చిద్విలాసుడగు శ్రీనివాసునికన్న మిన్న యెవరూ లేరు.

నమ్మినవారి వెంటనుండు వాడు. కష్టములలో సర్వస్వ మర్పించు వారికి సంతస మిచ్చెడి వాడు  నిన్ను నర్చించు జ్ఞానికి తోడు పద్మావతీపతి

వేదార్థములలో గాలించలేని రాధాకృష్ణకవిని బాలాజీయే కటాక్షించును

పల్లవి॥ హేశ్రీనివాసా! హేవేంకటేశా!
శ్రీశ్రీనివాసా! శ్రీచిద్విలాసా! ॥హేశ్రీ॥

చరణాలు॥ నిను నమ్మిన నీవారి గూడి
కనుదమ్ముల గావలి గాచే
వెనుదమ్ముగ వెలిగెడి జ్యోతీ
కొనరారా కొండల రాయా! ॥హేశ్రీ॥

కష్టమ్ముల గాచితి వనుచు
నష్టమ్ముల నవ్వుచు గొనుచు
తుష్టిగ నిలువు దోపుల నిడుచు
హృష్టి నొందు దృష్టుల గనుదు. ॥హేశ్రీ॥

కానుక లెన్నో కాంక్షతొ నిచ్చే
పూనిక తోనే పూజల జేసే
జ్ఞానికి తోడై కలుముల నొసగే
వానికి నాత్మార్పణ జేసితి సామీ! ॥హేశ్రీ॥

వేదార్థంబుల వెదుక లేని నను
రాధాకృష్ణుణ్ణి రసరాజ ప్రోవరా! ॥హేశ్రీ॥

(15)

స్వామీ గర్వాంధుడను గాక బేలగా సేవించి శాంతిని గంటిని.

తిరుమల స్వామీ! ఎన్ని విధముల కీర్తించి యలసినా తీర్థయాత్రలు చేసినా తుదకు నేమి చేయుదువో? నారదాది మునులను కంటి పాపలుగా బ్రోచితివి కర్మకాండలు నాకు దెలియకున్నాను మారుని కుమారునిగ బొందిన నిన్ను అందఱు స్తుతించుచున్నారు

ఆమోదముద్రలతో కవికృష్ణుణ్ణి దయ జూడుము

పల్లవి॥ జాలిగా వేడితి శాంతితో నుంటి
బేలనై కొలిచితి బీరాలు విడచితి. ॥జాలి॥

చరణాలు॥ కీర్తించి కీర్తించి కేలు మొగిడినా
ఆర్తితో బూర్తిగా నలసిపోయినా
తీర్థమంచు బనివడి తీర్థాలు సలిపినా
తేర్తువో యార్తువో తిరుమల దేవరా! ॥జాలి॥

నారదాదులు నిన్ను నవనీత రాగాల
శారద చంద్రికల సన్నుతులు గావింప
నీరదతేజంలో నిఖిలమ్ము పడయరా
కారుణ్య బుద్ధితో గావగా గోవింద! ॥జాలి॥

ధర్మదేవతగూడ దయతోడ జూచినా
కర్మకాండలలోన గణ్యుండ గాకున్న
మర్మరుని సుతునిగా బొందిన నినుగూడి
కర్మందు లెల్లరూ కాంక్షించు చున్నారె. ॥జాలి॥

మోదాన మునుగుచు ముద్దుల దనియించు
రాధాకృష్ణుణ్ణి రసరాజ బ్రోవరా! ॥జాలి॥

(16)

**కులముకంటె గుణము గొప్పది. జలములలో గంగాజలమే గొప్పది.**

ధర్మబలం మంత్రబలం గలిగి కులమత భేదం లేకున్న శిలాసదృశుల యందు గూడ శ్రీనివాసుడుంటాడు. ఆళ్వారుల్లో కులము లేనివారే యెక్కువ కని పారవేయబడ్డ వారే యెక్కువ. కని పారవేయబడ్డవారే కులగోత్రాతీతులే భగవంతునకు సన్నిహితులైనారు. ముక్తికి కులముగాదు భక్తి ప్రధానము.

మీ సన్నిధిని కోరు రాధాకృష్ణకవిని స్వీకరింపుము స్వామీ!

పల్లవి॥ కులమేది యయినా గుణములే మిన్న
జలమేది యయినా జాహ్నవే మిన్న. ॥కుల॥

చరణాలు॥ మలచిన రాళ్ళకు మంత్రాల బలమున్న
తలచిన ధర్మాలు దరిజేరు తృటిలోన
పిలచిన పలుకును భేదాలె లేకున్న
శిలలందు నిలచును శ్రీనివాసు మనము. ॥కుల॥

కులమున్నె పొయిగైకు గులమున్నె పూదత్తకు
కులమున్నె గోదకు గులమున్నె పేయకు
కులమున్నె తిరుమళిశైకు గుల మడుగు తిరుప్పాణిని
కులమేమి నమ్మాళ్కు కులశేఖరు కులమేమి?. ॥కుల॥

ఎక్కడయ్య కులము ఎక్కడయ్య జనమ
చిక్కడయ్య శ్రీపతి చింతింప గులము
దక్కునయ్య తిరుపతి ధ్యానమ్ము లేకున్న
మ్రొక్కులయ్య నీకంచు మ్రొక్కిన ఫలమేమి?. ॥కుల॥

తాదాత్మ్య మొందంగ దపియించు గవినయ్య
రాధాకృష్ణుణ్ణి రసరాజ ప్రోవరా! ॥కుల॥

(17)

లలాటమున కస్తూరి కటియందు పీతాంబరముతో వెల్గు శ్రీపతీ సంరక్షింపుము.

ఆంధ్రభూమిని పునీతం చేయుటేగాక యావద్భారతాన్ని ప్రపంచాన్ని కాపాడు చున్నావు చిదానంద దురాసదుడ వగు నిన్ను స్మరించుచున్నాను దేవుడు లేదన్న వారిని నీకడకు రప్పించుకొన్న పాలకడలివాసా! నమస్కారము.

వేదవేద్య! వేంకటాచలపతి రాధాకృష్ణకవిని రక్షింపుము.

పల్లవి॥ లలాటే కస్తూరీ లసల్లావణ్య మూర్తే
విలాస సంవర్ధిత పీతాంబర దివ్యమూర్తే. ॥లలాటే॥

చరణాలు॥ సంవర్ధితాంధ్ర సరోరుహ కర్మసాక్షిన్
సంవీక్షిత భారత సంస్తుత సంభూతతేజః
సంవసిత వాణీ సంరావ సంపూజ్యమాన
సంవర్త సంరక్ష సంసార! తుభ్యం నమః. ॥లలాటే॥

పరానంద చిదానంద పాంచజన్య హస్త
నిరానంద సురానంద నిర్మయప్రభావా!
దురాసంగ మురానంద దోర్దండ బలాత్మన్
దురాకృత నిరాకృత దురాసదమ్ భజామి. ॥లలాటే॥

పాషండ ఖండిత పరమార్థ పాండిత్య!
దోషార్థ చండిత దుర్దాంత వందిత!
దోషారి మండిత దుఃఖాబ్ధి భంజిత!
దోషజ్ఞ రంజిత దుగ్ధాబ్ధి వాసం భజే!. ॥లలాటే॥

వేదాంత మూర్ధన్య వేంకటాచల స్వామిన్
రాధాకృష్ణం వరకవిం రసరాజా! రక్షమామ్. ॥లలాటే॥

(18)

కాలస్వరూపుడవైన కలియుగదేవా! శ్రీనివాస! నమస్కారం.

అన్నముపెట్టి బంధాలు తెంచి పాపులను శిక్షించిన స్వామివి నీవు. మునులకు ప్రేమను బంచిన వాడవు గోపికల భక్తికి పరవశించావు ఎందరినో తృప్తి పొందించిన వాడవు నీవు. ధర్మదీప్తివైన నీవు రాధాకృష్ణుణ్ణి కరుణించు స్వామి.

పల్లవి॥ కాలస్వరూప కలియుగ దీప
శ్రీలక్ష్మీహృదయ శ్రీశ్రీనివాస! ॥కాల॥

చరణాలు॥ అన్నమనే స్వాములకు నన్నంబు పెట్టావె
బన్నమనే భక్తులకు బంధాలు తెంచావె
పన్నగమౌ కాళియుని భంగ మొందించావె
చెన్నుగ బద్మతో స్నేహాలు నెఱపావె. ॥కాల॥

ఏమీ యెఱుగని యెందఱో మునులకు
ప్రేమానురాగాలు ప్రీతితో బంచావు
కామార్తుల కాంక్షలు కరుణతో దెంచావు
వామాక్షుల భక్తికి బరవసించి పోయావు. ॥కాల॥

భూతపంచకము పురుషార్థంబులు
చైతన్యజగతి శాంతిప్రశాంతులు
నూతనరాగాల నుతులౌ భావాలు
తాతల దంద్రుల దనియించె బద్మాక్షుడు. ॥కాల॥

శ్రీధర్మ మందున జెలగు వేంకటపతి
రాధాకృష్ణుణ్ణి రసరాజై ప్రోచురా! ॥కాల॥

స్వామీ! పొగడపూల మాలను మీకు నర్పింప వచ్చితిని

కూరిమితో గూర్చిన దీనిని స్వీకరింపుము స్వామీ! సర్వసంపదలు నియమాలు బంగరునగలు నశించిపోవునవే. రూపసౌందర్యములు లయమగును నీపై నున్న కోరికలు నిత్యమై భక్తిగా రూపొందును స్వామీ! కలుములు కాంతలు శాశ్వతము గావు

నీ కథలు జ్ఞానామృతమయి యీ రాధాకృష్ణుణ్ణి కాపాడవా స్వామీ!

పల్లవి॥ వకుళపుష్పములన్ని వనమాలి! పూచె
ముకుళిత కరముల బూమాలతో వస్తి ॥వకుళ॥

చరణాలు॥ కనకాంబరునకు గంరాన నర్పింప
తనరుచు వచ్చితి తన్మయత్వమున
కొనవయ్య మలచితి కూరిమి మాలను
వినవయ్య విన్నపాలు వేంకటాద్రి స్వామి. ॥వకుళ॥

నీమాలు నామాలు నిలువున నీఱగును
దామాలు దణ్ణాలు దరిజేరి నిలువవు
హేమాలు సంపదలు హీనాతి హీనాలు
కోమలుల రూపాలు కుములు లే కాష్ఠాన ॥వకుళ॥

నిలుచును నిత్యమై నినుజేరు కోరికలు
కలకాల మందురు కలవాని బంటుంచు
వలపైన భక్తియే పాటగా రూపొందు
కలుములు కాంతలు కరుగులే గోవింద! ॥వకుళ॥

బోధామృతమ్మె పుణ్యాల రాశులై
రాధాకృష్ణుణ్ణి రసరాజ ప్రోవవా? ॥వకుళ॥

(20)

ప్రతిదినము శ్రీరంగదర్శనమునకై మాలికల గూర్చిన పరమభక్తుడు విప్రనారాయణ.

తులసిని కోసి చంద్రకాంతిని చందనగంధమును కలిపి గూర్చిన దండను ముందుగ సమర్పించువాడు. ఆశ్రమ మందలి శ్రేష్ఠమైన పుష్పములతో మాలలను గట్టి శ్రీరంగనికి అర్పించును.

దేవదేవి యను వేశ్య అతనిని ప్రేమలోనికి దింపినది. దానితో విప్రనారాయణ అపకీర్తిపాలైనాడు.

అటువంటి వానిని గూడ కూర్మితో ననుగ్రహించిన వాడు కవినైన యీ రాధాకృష్ణుణ్ణి గైకొనడా? గైకొనును.

పల్లవి॥ నిత్యము శ్రీరంగని జూచే వేడుక
సత్యము గనుగొన సరము లల్లెగా. ॥నిత్య॥

చరణం॥ వృందను గోసి ప్రేమను గలిపి
చందురు వెలుగు సన్నగ జొనిపి
చందన గంధము శస్తము జేసి
ముందుగ సరమును బూని యర్పించు. ॥నిత్య॥

ఆశ్రమవాసి యారంగ భక్తుడు
ఆశ్రమ మందలి యరుదైన విరులు
విశ్రుత ఫణితిని విందులు గూర్ప
నశ్రులు జార్చుచు నల్లెను మాలలు. ॥నిత్య॥

విప్రనారాయణ వేంకటేశు గోర
నప్రహతముగ నాదేవదేవి
విప్రుని భక్తిని బ్రేమగ మార్చెను
అప్రతిష్ఠ యలమె నాతని జన్మకు. ॥నిత్య॥

క్రోధము జూపక కూర్మిని జూపె
రాధాకృష్ణుణ్ణి రసరాజ బ్రోవరా! ॥నిత్య॥

(21)

వరదుడైన శ్రీరంగనాధుని గూడ ధరణీదేవియె గోదాదేవిగ అవతరించినది.

సౌందర్య విరాజిత రూపముతో దామరలను దలదన్ను కాంతి పుంజంతో నాండాళ్గ నవతరించింది. తాను దాల్చి చూచుకొనిన మాలలను రంగనాధున కర్పించింది. శ్రీరంగని భర్తగ పొందింది.

రాధాకృష్ణకవి నైన నేను నిన్ను నాయకునిగ వాంఛించితి. రసరాజా నన్ను గైకొనుము.

పల్లవి॥ ధరణీదేవియె తనువును దాలిచె
వరదుని శ్రీరంగవాసుని గూడంగ. ॥ధరణీ॥

చరణాలు॥ వెన్నెల చూడ్కులు విష్ణుని గోరుచు
చెన్నగు బంగరు సిరులగు కాయము
కన్నెల వలపించు కమనీయ ముఖము
చిన్నెలు వోయెడు శ్రీరంగని జేర. ॥ధరణీ॥

తామరపుష్పము దలదన్నె గోదా
స్వామిని జేరగ వాంఛించె గోదా
దామము కంఠాన ధరియించి చూచుక
స్వామికి నొసగెను బరవశమున గోదా. ॥ధరణీ॥

క్రోధము జెందక కూరిమి పెనగొన
నాధుగ వలచిన ననబోడి గోదను
భూధర ధరణుడు పొందగ దలచెను
నాధుడై శ్రీరంగ నాధుడె మురిసెను. ॥ధరణీ॥

నాధుగ గోరిన నడకుదురు కవిని
రాధాకృష్ణుణ్ణి రసరాజ బ్రోవరా! ॥ధరణీ॥

(22)

**తులసితోటలో దొరికిన బిడ్డ శ్రీరంగని వరించుట యేమిటి?**

దైత్యారి గోదాదేవి ధరించి యిచ్చిన దండను స్వీకరించి మానవ జన్మ మహోన్నత మని నాడు తండ్రి విష్ణుచిత్తుడు, ఇది తగనిపని యనుకొన్నాడు. క్రమంగా కుమార్తె పనిని సమర్థించుకొన్నాడు అనంతరం సౌందర్యరాశి యగు నాండాళ్ అందరు చూచుచుండ రంగనిలో నైక్యమయింది

నీలమేఘశ్యాముడు రాధాకృష్ణుణ్ణి యనుగ్రహించడా? యని తలంపు

పల్లవి॥ తులసీవనమున దొరికిన శిశువు
విలసిత శ్రీరంగ విభుని వరించు టేమో? ॥తులసీ॥

చరణాలు॥ తాను ధరించిన దామము తులసిని
నేను ధరించుట నిర్మల మంచును
ఆనందమ్మున దైత్యారియె మురియుచు
మానవ జన్మము మహోన్నత మనె స్వామి ॥తులసీ॥

తాత తలచెను దగునా యిది యని
వీత రాగుని మతి వెతలను బొందెను
పూతాత్ముల కిది పుణ్యమౌ ననుకొని
కైతవ మిది కానే కాదనె విష్ణుచిత్తుడు. ॥తులసీ॥

సుందరస్వామికై సుందరి పరుగిడె
సౌందర్యరాశియౌ సారసలోచన
సుందరి యాండాళ్ చూడుడు మీరలు
అందరి ముందరె యనంతు జేరెను. ॥తులసీ॥

మేధావి యయిన మిన్నువన్నెలవాడు
రాధాకృష్ణుణ్ణి రసరాజై బ్రోవడా! ॥తులసీ॥

ఆపదలలో నున్న పేదలకు సాయ మందించుచున్నావు.

స్వామి! నీవు రుజాగ్రస్తులైన వారి వ్యాధులను తొలగించుచున్నావు. వారు నీ చరితలను లోకమంతయు చాటుచున్నారు. నిన్ను సేవించువారి శోకములను పోజేయు నీవు భగవంతుడవు గాక మరెవరో.

అబద్ధ మనిన వారు కష్ట సముద్రమున మునుగుచున్నారు ఈ రాధాకృష్ణకవిని కాపాడు వాడవు నీవే శ్రీనివాస!.

పల్లవి॥ పేదల యిడుమల బిలిచిన బలికేవు
నీదగు సాయము నిలిపేవు కాచేవు. ॥పేద॥

చరణాలు॥ వ్యాధుల నలగుచు బాధల మునిగిన
గాథలు తెలిసిన కారుణ్య మూర్తివి
వ్యాధుల దీర్చుచు వ్యథలను నణపుచు
సాధుల గాచెడి సద్గురు స్వామి!. ॥పేద॥

వింత వింతగు వేంకట పతి కథలు
చింతన జేయుచు జెలగెడి వారలు
అంతము లేని యనంతు జరితను
పుంతలు దాటగ భువిని జూటెడిని. ॥పేద॥

పేదల పాలిటి వేంకటేశు డనుచు
తా దల దాల్చుచు దన్మయు లగుచు
వాదన లేల వందనీయు డనుచు
మాదగు దుఃఖము మరలించె మేలుగ. ॥పేద॥

కాదను వారలు కష్టాల కడలిలో
రాధాకృష్ణుణ్ణి రసరాజు బ్రోచులే. ॥పేద॥

(24)

కమలాక్షి పద్మతో బాలాజీ వివాహమట. పెండ్లికి నందరిని నాహ్వానిస్తున్నాడట. అవే బ్రహ్మోత్సవము లట.

అలంకరించుకొని గరుడు వాహన మెక్కి బయలుదేరుతాడట. సన్నాయి మేళం సరస సంగీతాలు వేణుగానాలంట. అందగత్తెల నాట్యా లంట. పద్మావతి శ్రీనివాసుని గోరి ప్రేమించిందంట. మునీశ్వరులే దీన్ని కూర్చారంట మనం కూడ పోదాం చూదాం.

పల్లవి॥ బాలాజీ పెండ్లంట బ్రహ్మోత్సవా లంట
కాలమాయె నంట కమలాక్షి తోడంట. ॥బాలా॥

చరణాలు॥ గరుడ వాహన మెక్కి కదలు తాడంట
తిరుకాపు చేసుక తిరుగుతా దంట
అరుదైన బంగారు అరద మెక్కు తాడంట
పరువైన పడతులు పక్కనుంటా రంట. ॥బాలా॥

సన్నాయి మేళాలు సరస సంగీతా లంట
విన్నాణ మైనట్టి వేణు గానా లంట
కన్నార గననట్టి కళ్యాణ వేడుక లంట
క్రొన్ననల నదలించు గోమలుల నాట్యా లంట. ॥బాలా॥

ఎదురు కోల లంట యేల పాట లంట
కుదురు జంటంట కోరి వలచిం దంట
ముదురు మునులంట మురిసి కూర్చా రంట
కదలండి కదలండి కన్నార చూదా మంట. ॥బాలా॥

భేదాలు లేకుండ బ్రీతితో జూచు నంట
రాధాకృష్ణుణ్ణి రసరాజై ప్రోచునంట. ॥బాలా॥

25

చిఱునవ్వుతో ననురాగంతో కాంతివంతమైన కనులతో మేలైన తనువు ధరించిన వాడు శ్రీనివాసుడు

భక్తుడగు ప్రహ్లాదుడు ప్రార్థించి హరిని గన్నాడు నారదుడు మహతి మీటుచు నాట్యం చేశాడు హిరణ్యకశ్యపుడు భగవదనుగ్రహం కోసం కోరి విరోధియై సన్నిధికి జేరాడు

వేదాంతవేద్యుడు రాధాకృష్ణుణ్ణి రక్షించదా?

పల్లవి॥ చిఱునవ్వుల వాడు చిందు రాగము వాడు
మెఱుగు కన్నుల వాడు మేలైన రూపము వాడు ॥చిఱు॥

చరణాలు॥ పరమ భక్తుడు ప్రహ్లాద బాలుడు
విరతి జెందక వేంకటేశు తోడ
కరుణించ మనుచు గారుణ్య గూడ
విరమణ మెఱుగక వేడి కన్నాడు. ॥చిఱు॥

నారదు దండాల నాట్యాలు చేయుచు
కూరిమి రాగాలు కులికెడి మహతిపై
చేరిచి పాడెను శ్రీహరి గూరిచి
హారతి పట్టెను బ్రహ్లాదు మోమున ॥చిఱు॥

ధోరణి మారని దుర్భాగ్యపితరుడు
తీరని వాంఛలు తేరని ప్రాణుడు
నారసింహుని జేర నందను వీడ
కోరిక కోరెగ గ్రోధిహిరణ్యుడు. ॥చిఱు॥

వేదాంతవేద్యుడు వేంకటేశ్వరుండు
రాధాకృష్ణుణ్ణి రసరాజై బ్రోవదా! ॥చిఱు॥

26

ఎందున్నాడా? విష్ణువు. 'సర్వం విష్ణుమయం' సందేహమా?

మందమతులు అజ్ఞానంతో బలువిధాలుగ మాట్లాడుచున్నారు. చందనం మోయు జంతువునకు సువాసన తెలియదు ఆనందించదు. తందాన అంటే తాన తందాన అనువారే గాని యదార్థము నెఱుంగరు.

భూదేవి వంటి శాంతము గల శ్రీవేంకటేశా! రాధాకృష్ణకవిని ననుగ్రహింపుము.

పల్లవి॥ ఎందున్నాడా హరి! యిందందున్నాడా?
సందేహ మేలరా? 'సర్వం విష్ణుమయం'. ॥ఎందు॥

చరణాలు॥ ఇందు గలడని యిందున్నాడని
అందు లేదని యంతాభ్రమేనని
కొంద రనుచూ కుందు చున్నారని
మందమతు లంట మాధవ! తెలియదా? ॥ఎందు॥

చందనము మోయు జంతు జాలమ్ము
చందన గంధము శ్వాసించి నంత
పొందునా మోదమ్ము పొందునా సౌఖ్యమ్ము
విందుమా యెందైన వింతైన వార్త. ॥ఎందు॥

తందాన యని యన్న తానతందాన
అందురే జగతిని నాలోచన లేమి
కుందన మబ్బినా కొనజాల రేల?
మందుల మైనాము మహిలోన మనము. ॥ఎందు॥

భూదేవి శాంతమ్ము పొందావె నీవు
రాధాకృష్ణుణ్ణి రసరాజు బ్రోవదా?. ॥ఎందు॥

(27)

**పద్మావతీపతీ! కొందరు పరుల సొమ్మును అమృతంగా గ్రహిస్తారు.**

మోహినీరూప! మోసమును హృదయంలో దాచుకొని పాపపు వర్తనలతో శోకపూరిత నటనలతో నటిస్తారు. అట్టి వారిని గూడ కరుణించి పరమియ్యుము. స్వామీ! మిమ్ము విగ్రహ మని యన జాలను.

నాదబ్రహ్మ మైన నీవు రాధాకృష్ణుణ్ణి కాపాడు స్వామీ!

పల్లవి॥ పరుల సంపద పంచామృత మని
పరిగ్రహింతురు పద్మాక్ష పుణ్య మని. ॥పరుల॥

చరణాలు॥ మోసాల హృదయాలు మురిపాల మాటలు
దోసాల బ్రతుకులు దుందుడుకు చేష్టలు
వేసారు నటనలు విలపించు పలుకులు
మోసాలు కాకేమి మోహినీ యవతార! ॥పరుల॥

దయజూపు మనసిచ్చి దండింప నేలయ్య
వ్యయమైన జన్మాలు వర్ధిల్లు టెటులయ్య
వయసొచ్చి నయమెచ్చి వగపొంద కాదయ్య
భయమేమి లేదంచు బరమీయ లేవయ్య. ॥పరుల॥

ఉగ్రుండ గానయ్య యురిమి చూడకయ్య
నిగ్రహ మ్మీవయ్య నిందింప లేనయ్య
అగ్రమ్ము నాదంచు నననయ్య నేనయ్య
విగ్రహ మీవంచు వివరింప జాలయ్య. ॥పరుల॥

నాదమ్ము నీవయ్య నారాయణుడ వయ్య
రాధాకృష్ణుణ్ణి రసరాజు బ్రోచురా! ॥పరుల॥

(28)

కోవెలలో వైష్ణవుడు సంచరించుచున్నాడు. భిక్షవేయ వయ్యా తిరుమలయ్యా!

స్వామీ! నేను నీ యొద్దకు వచ్చాను. దారితెన్నూ లేక యలమటించు పేదల కోసం వచ్చాను. మోక్షమును సిరులను గోరలేదు. వేటిడి జన్మల కాపాడుము స్వామీ! నేడు లోకం ధనం కోసం పోరాడు తూంది. ప్రబుద్ధులు దేశమాత శిరస్సు దగ్గర దీప ముంచారు. ఎరుగుదువు గదా స్వామి.

ఈ లోకమును కాపాడు మార్గమును జూపి రాధాకృష్ణ కవిని నోదార్చు శ్రీనివాస.

పల్లవి॥ తిరుమాళిగ లోపల తిరుముడి తిరిగేను
తిరిపంబు వేయరా తిరుమల రాయడా! ॥తిరు॥

చరణాలు॥ కోరి వచ్చానురా కోరిక తీర్చరా
భూరి తిరిప మిమ్ము భువనాలు దీపింప
దారితెన్నూ లేక దారిద్ర్య మందెడి
వారి కోసమై వచ్చాను నీదరికి. ॥తిరు॥

మోక్ష మిమ్మన లేదు ముడుపు కోరగ లేదు
దాక్షిణ్య రూపాన దయజూప మంటిరా
వీక్షించుచుంటివా వేటిడి జన్మల
సాక్షాత్కరించరా సదయుడ రక్షింప. ॥తిరు॥

దేశమాత గతియేమి? తీర్థాల మహి మేమి?
కోశమ్ము కొలకుగా గొట్టుకొనుచున్నారు
దేశికోత్తములను దీవించు చున్నారు
దేశమ్ము తలవద్ద దీపమ్ము నుంచారు. ॥తిరు॥

ఏదిరా మార్గమ్ము ఇజ్జగతి కాపాడ
రాధాకృష్ణుణ్ణి రసరాజ ప్రోవరా! ॥తిరు॥

**ఓ స్వామీ! కాకాలకు నెందుకు లొంగెదవు.**

ఓ దేవదేవా! పాపహరణం చేసి దీపాల వెలిగించి దివ్యలోకము నిచ్చు మా పాలికి శోక మేమి స్వామీ! వరములను పరమును నిత్తు నని శత్రువుల నిచ్చావేమి? స్వామీ. ఎక్కడ భాగ్యము? అయినను నీకు దూరము కాను. దూషింపను. తీరము జేర్చు భారము నీది

నీ దాసుడగు రాధాకృష్ణకవిని కరుణించుము

పల్లవి॥ లోకాల నేలే లోకేశ్వరా
కాకాల నేల కామింతురా ॥లోకా॥

చరణాలు॥ పాపాల నణగించి పరమపుణ్య మిచ్చి
దీపాల వెలిగించి దివ్యలోకము నిచ్చి
మాపాల బడినట్టి మంటల నెగద్రోసి
భూపాల యెందుకు ముదమందు చున్నావు ॥లోకా॥

వరదుడు నన్నావు వంతల నిచ్చావు
పరమిత్తు నన్నావు పరిపంధు లిచ్చావు
కరమెత్తి యభయమ్ము కైకొమ్మ నన్నావు
భరమైన బ్రతుకుల్లో భాగ్యాలె యన్నావు. ॥లోకా॥

దూరమ్ము కానురా దూషింప లేనురా
భారమ్ము కానురా భావించు చుందురా
తీరమ్ము జేర్చరా దీవించి పంపరా
వారమ్ము వర్షమ్ము వనజాక్ష నీవెరా! ॥లోకా॥

నీ దాసుణ్ణి భీరుణ్ణి నీ పాదభక్తుణ్ణి
రాధాకృష్ణుణ్ణి రసరాజ ప్రోవరా! ॥లోకా॥

## 30

పూర్వజన్మ పుణ్యం వలన నేడు చేయు సేవల వలన మాధవుని స్తుతించు భాగ్యం కలిగింది.

ముందు గలుగబోవు జన్మకు బునాది నీ కీర్తనము. ఋణములను తొలగించు పనే నీ స్తోత్రము శ్రీనివాస. పుణ్యశాలురు పాపిష్ఠులు గూడ నిన్ను స్తుతింతురు. నాయకులు వినాయకులు శ్రద్ధాభక్తులతో నీస్తుతి నీపూజ గావింతురు. స్వీకరింతువో లేవో?

ముకుందుని స్తుతి యానందమును గలిగిస్తుంది. ఆ యానందము నాకు గూడ కలిగించు శ్రీనివాస

పల్లవి॥ వెనుక జన్మల కర్మ వేంకటేశ కీర్తనం
మనుజ పూజల కర్మ మాధవు కీర్తనం. ॥వెనుక॥

చరణాలు॥ జీవిజనముల కర్మ శ్రీనివాస కీర్తనం
భావి జనమల కర్మ ఫణిభోగి కీర్తనం
ధీవిశాలుని కర్మ తిరుమలేశు కీర్తనం
మా విభూతుల కర్మ మాధవు కీర్తనం. ॥వెనుక॥

గుణముల కామించు కర్మ గోవిందు కీర్తనం
గణముల సేవించు కర్మ ఘనవైద్యు కీర్తనం
కణముల గణియించు కర్మ కమలాక్షు కీర్తనం
ఋణములు తొలగించు కర్మ ఋషిరాజు కీర్తనం.॥వెనుక॥

భూషిత పుణ్యుల కర్మ భువనేశు కీర్తనం
దూషితపాపుల కర్మ దుఃఖారి కీర్తనం
పోషితనేతల కర్మ మోహను కీర్తనం
శోషితదీనుల కర్మ సుదర్శను కీర్తనం. ॥వెనుక॥

మోదాల ముంచెడి కర్మ ముకుందకీర్తనం
రాధాకృష్ణునికర్మ రసరాజ కీర్తనం. ॥వెనుక॥

(31)

**గోవింద! పద్మావతీపతి! లాలిపాడెద నిద్రించుము.**

ఉయ్యెలలో నూగెడి కంజాతనయనాల స్వామికి లాలి. బంగరు భూషలతో సామగానాలతో ప్రకాశించు నీకు లాలి ఉదరమున దామమము మోమున లోకాలు గల స్వామికి లాలి. పూలంగిసేవలో కౌస్తుభకాంతుల్లో వరలే స్వామికి లాలి.

రాధామాధవుడైన స్వామికి లాలి లాలి పాడించుకొను స్వామి రాధాకృష్ణుణ్ణి రక్షించదా? తప్పక రక్షించును

పల్లవి॥ జో లాలీ శ్రీపతి! జో లాలీ పద్మాపతి!
జో లాలీ గోవింద! జో లాలీ శ్రీనివాస! ॥జోలాలీ॥

చరణాలు॥ ఉంజల సేవలో నూగెడి సామికి
వింజామర వీచిలో వెలిగెడి సామికి
కంజాత నయనాల గ్రాలెడి సామికి
రంజిల్లు రాగాల రంగారు సామికి ॥జోలాలీ॥

సామగానములోన శయనించు సామికి
హేమభూషలలోన హేమించు సామికి
మోమున లోకాలు మురిసెడి సామికి
దామము నురమున ధరియించు సామికి. ॥జోలాలీ॥

నీలమణి కాంతిలో నెలవైన సామికి
పూలంగి సేవలో బొందైన సామికి
నీలాల కురులలో నిగనిగల సామికి
ఫాలాన కస్తూరి పరిమళించు సామికి. ॥జోలాలీ॥

రాధా మాధవుడై రాగిల్లు సామికి
రాధాకృష్ణుణ్ణి రసరాజై బ్రోచే సామికి. ॥జోలాలీ॥

(32)

స్వామి! ఈ తగువులు వలదు. అని మేమూరకుండము.

తమ యింటినే దోచుకొనే ప్రబుద్ధులతో మంతనములా? కటికి కసాయిల గాపాడు మను విన్నపమేల? సంస్కారములేని వారి సంస్కరించే శక్తి లేదా? శక్తియుక్తులతో వారల మార్పు చేయుము. లోక రక్షణార్థము దశావతారములు ధరించిన నీవు దుర్మార్గుల శాసించవా?

నీ బోధలచే నానందము గలిగింపుము రసరాజా! రాధాకృష్ణకవిని కాపాడుము.

పల్లవి॥ స్వామి! యీ కొట్లాట వలదు వలదయ్య
మేమేల లోకాన మిన్నకుండ వలెనయ్య! ॥స్వామి॥

చరణాలు॥ ఎంత కాలమో యీ యింటి దోపిడి
సుంత యయినా చూడ కుంటివా?
మంత నాలా మహమ్మారికై నీవు
చింత సేయగ క్షేమ మరసే విన్నపమ్ము. ॥స్వామి॥

సంస్కార శూన్యం సంస్కృతి శూన్యం
సంస్కరణ లేని సద్బుద్ధి శూన్యం
సంస్కరింపగ చాలదా యుక్తి
సంస్కరింపు మయ్య శక్తితో శ్రీనివాస! ॥స్వామి॥

జనులకొఱకు నీవు జలశయను వైతి
జనుల కొఱకు నీవు జలజాక్షి గైకొంటి
జనుల మేలు కొఱకు జన్మాల నెత్తితి
జనుల మేలు గోరి శాసించు దుష్టుల. ॥స్వామి॥

బోధనానంద మొందింప బూనుమా దేవ
రాధాకృష్ణుణ్ణి రసరాజ ప్రోవరా! ॥స్వామి॥

(33)

'మానవసేవే మాధవసేవ' అది పూర్వకాలపుమాట. నేడు మానవుల సేవించిన మంటల పాలగుచున్నారు. దీనుల రక్షించు దేవుని సేవించుట లేదు ప్రజలు.

రాశుల రాశుల మ్రింగు రాబందుల గాంచి భరతమాత దుఃఖిస్తూంది. స్వామి! నీ వెందుకు భయపడుచున్నావు. రక్షక భక్షకు లెవరో తెలియక భీతిల్లు చుండ దెలుప వేమి వేంకటనాయక. సంసార బంధాలు కామోప భోగాలు హింసించు వారు హీనులేనా స్వామి.

బాధల తొలగించి రాధాకృష్ణకవిని దయజూడుము వేంకటనాయక.

పల్లవి॥ మానవుల సేవించి మంటల బడనేల!
దీనుల సేవించే దేవుని గనరేల? ॥మానవు॥

చరణాలు॥ దేశమాత దిగులొందు చుండ
కేశవు నెందుకు కీర్తింప వలయు
రాశులు మ్రింగెడి రాబందుల గనుచు
పేశల హృదయుడ భీతిల్ల నేల? ॥మానవు॥

ఎవరు నాయకులో నెవరు వినాయకులో
ఎవరు దొంగలో నెవరు భక్తులో
ఎవరేమో తెలియక యేడ్చుచున్నా మయ్య
వివరించ వేమీ వేంకట నాయకా! ॥మానవు॥

సంసార బంధాలు సాగి నన్నాళ్ళు
శంసింప రాదని స్వామి యున్నావ
కంసారి నీవంచు కామోపభోగాల
హింసించు వారలు హీనులే యంటావ. ॥మానవు॥

బాధల తొలగించు బాంధవ పరమేశ
రాధాకృష్ణజ్ఞీ రసరాజ ప్రోవరా! ॥మానవు॥

(34)

అలంకరించుకొని సింహవాహనమెక్కి సింహమైతివా నరసింహా!

దుష్టశిక్షణ శిష్టరక్షణ జేసి భ్రష్టాచారుల నశింపజేయి. హంస సింహముగ మారినను సింహగుణము రాదు. హంసను సోఽహమ్ గా మార్చిన సోఽ హమ్ మిగులుతుంది. భూతములు విభూతులు మున్నగునవి మానవుల జన్మ హక్కులందువా? వేంకటేశ.

నాధమునిని బ్రోచిన నీవు రాధాకృష్ణకవిని నన్నాదరింపవా శ్రీనివాసా.

పల్లవి॥ శృంగారించుకొని సింహవాహన మెక్కి
సింగమ్ము వైతే శ్రీనారసింహా! ॥శృంగా॥

చరణాలు॥ దుష్టశిక్షణ జేసి శిష్టరక్షణ జేసి
కష్టసమయములందు గాచు నట్టి సామి
ముష్టింపచులను మూదలింప లేవా?
భ్రష్టాచారుల భంజింప రావా? ॥శృంగా॥

హంసమును ద్రిప్పి సింహమును జేసినా
హంసగుణము పోదు సింహగుణము రాదు
హంసమ్మును మార్చి సోఽహమ్మును గావింప
హంసమే సోఽహమౌ హరి వేంకటేశా! ॥శృంగా॥

భూతపంచకంబు విభూత్యష్టకంబు
భూతారి వర్గంబు ధూర్తేషణాత్రయంబు
వీతరాగతపంబు విమలమంత్రజపంబు
జాత మందు వారి జన్మహక్కు గాద? ॥శృంగా॥

నాధమునిని బ్రోచి నన్నాదరింప లేవా?
రాధాకృష్ణుణ్ణి కవిని రసరాజ ప్రోవరా! ॥శృంగా॥

మా ప్రేమను స్వీకరించి మా కోర్కెల దీర్చి ధర్మకామ మొసంగి సత్కర్మలయందు నిల్పుము.

భక్తిజ్ఞాన కర్మలను బొందలేక యున్న దీనజనుల కాపాడుము. జీవు లన్నియు నీకై తపించుచున్నవి. నరకమున బడినను నీ వారు నిన్ను మరువ లేకున్నారు. నిన్ను బొందజూచుచున్నారు.

దారి బత్తె మగు నీవు రాధాకృష్ణజ్ఞి రక్షింపుము స్వామి.

పల్లవి॥ ప్రేమ త్రాగ వయ్య ప్రీతి నీయ వయ్య
కామధర్మ మిచ్చి కర్మ నిలుపు మయ్య! ॥ప్రేమ॥

చరణాలు॥ జ్ఞాన మంద లేక కర్మ నెఱుగ లేక
వానప్రస్త మేగి భక్తి నంద లేక
దీను లైన యట్టి దీనజనుల బ్రోచి
మౌనముద్ర మాని మాధవ! కావర. ॥ప్రేమ॥

ప్రాణు లన్ని నీకై రగులుచున్న వన్న
ప్రాణ మైన నీవు రాగ మీయ వన్న
ప్రాణచలన మీవై ఫలిత మీయ వన్న
ప్రాణ మీయ నున్న భక్త జనుల గనవ?. ॥ప్రేమ॥

నిండు మదిని వేడి నిలువ నీడ లేక
నిండుకొన్నవాడి నిండుబ్రతుకులేక
నిండు ఘటము జారి నిరయ మందుబడ్డ
నిండు మనము వీడ నిన్ను గూడ జూచు. ॥ప్రేమ॥

పాథేయ మగు నీవు పఱగ జూడ వయ్య
రాధాకృష్ణజ్ఞి రసరాజ బ్రోవరా! ॥ప్రేమ॥

(36)

షట్చక్రముల కావల ప్రకాశించువాడా! నదులన్నీ యెచ్చట చేరుచున్నవి!

శ్రీ వేంకటేశా! మృషలు పలికి మాకు జన్మల నీయకుము. మూర్ఖులకు జ్ఞాన మెందు కని కోపముగ జూడకుము. స్వామీ కోరికల పోకార్చుము. కోపించిన మునులను గరుణించితివి గదా! హృదయమున బుట్టిన చెడు కోరికలకు శిరము వంచలేను.

నాధుడ వైన నీవు రాధాకృష్ణకవిని నన్ను నీదరికి చేర్చుకొనుము

పల్లవి॥ ఆఱు మేడలపైన నలరారే సామీ
ఏరులన్నీ కలిసి యెటకేగు సామీ! ॥ఆఱు॥

చరణాలు॥ విషయ మెఱుగ మైతి వేంకటేశ స్వామీ
ధిషణ నీయ వైతి దీప్తిరూప స్వామీ
మిషలతోడ మమ్ము మేలుకొలుపు సామీ
మృషలు చెప్పి మాకు మేను లీకు సామీ! ॥ఆఱు॥

పసిడి పుటము వెట్ట పసిమి జెందు నట్లు
పసుల కేల జ్ఞానభాండ మిత్తు నంచు
కసిగ జూడ వద్దు కాంక్ష లడప ముద్దు
కసరుకొన్న మునుల గాంచ లేద సామీ! ॥ఆఱు॥

పురమునందు బుట్టి పొంగు రుచుల కెటుల
శిరము వంచి మ్రొక్క చేతగాదు సామీ
కరము నందు నున్న కాంతిరేఖ లెన్న
వరము నిమ్ము దేవ! పరము గలుగ సామీ! ॥ఆఱు॥

నాధు వైన నీవు నన్నాదరింప రావా?
రాధాకృష్ణుణ్ణి రసరాజ బ్రోవవా?. ॥ఆఱు॥

(37)

నాపాలి భాగ్య మగు స్వామి! పద్మావతి తోడుగ నన్ను జూడుము.

నీకై మల్లెల పాన్పు సిద్ధము చేసితిని. విరులు సిరులు మురికి కూప మగు సంసారపుటాలోచనలు విందు గూర్చవు శ్రీనివాస! నాకు స్వర్గభోగములు వలదు. దిక్కు లేని నేను నీ పిలుపునకై రాత్రింబవళ్ళు నిరీక్షించుచుంటిని.

ప్రాథమికుడను రాధాకృష్ణకవిని నిన్ను ప్రార్థించుచున్నాను. సహకార మిమ్మని.

పల్లవి॥ నన్నేలు కోవయ్య నాపాలి భాగ్యమా
కన్నార చూడయ్య కళ్యాణి తోడుగా ॥నన్నే॥

చరణాలు॥ మల్లెపూల పాన్పు మదికి హాయి యనుచు
పల్లెపల్లె నుండి పఱగ తెస్తి పఱచ
విల్లు నెక్కు పెట్టి విరుల బాణ మేయ
జల్లు మనగ గుండె జలజ ముఖము విరిసె. ॥నన్నే॥

ఎందుకయ్య విరులు ఎందు కయ్య సిరులు
చందు రయ్య వలులు సాగు నయ్య మరులు
ముందు చూపు లేక మురికి కూప కలలు
విందు చేయ లేక వెడలె శ్రీనివాస! ॥నన్నే॥

శివము గూర్చు సామి శ్రీనివాస స్వామి
దివము నాకు వలదు దిక్కు నాకు లేదు
శవము పగిది నుండ జనున శ్రీనివాస
పవలు రాత్రి తలపు పరమపురుషు పిలుపు. ॥నన్నే॥

ప్రాథమికుడ నేను ప్రార్థింతు స్వామి
రాధాకృష్ణుణ్ణి రసరాజ ప్రోవరా! ॥నన్నే॥

సూర్యప్రభారధము మీద సూర్యతేజమును మించి ప్రకాశించుచున్నావు శ్రీ వేంకటేశ.

కోటిసూర్యప్రభా భాసమానుడ వైన నిన్ను కోటి జన్మ లెత్తి యయిన సేవించెదను పుణ్యభూమిలో జన్మించి నిన్ను తెలిసికొను మార్గము చెప్పకున్న ముక్తి యెట్లు లభించును. వేద మంత్ర ఘోషలలో భక్త హృదయ భాషల్లో నొప్పు వేంకటేశ్వరా! సాధువుల రక్షింపుము

పాలసముద్రమున బుట్టిన పద్మావతీ స్వామీ! రాధాకృష్ణుణ్ణి సత్కవిని యయిన నన్ను కనికరింపుము.

పల్లవి॥ సూర్యచంద్రనేత్ర సూర్యప్రభలతో
సూర్య ప్రభారధముపై సూర్యప్రభల మించితే. ॥సూర్య॥

చరణాలు॥ కోటిసూర్యకాంతి కోమలుండ వైన
మేటిగాన మెసగు మేటి భజన నొసగు
వీటిస్థగితగంధపేటి వైన గాని
కోటి జన్మ లెత్తి కొలువగలను స్వామి. ॥సూర్య॥

పూట గడవ నట్టి పుణ్య భూమి బుట్టి
చోటు లేక నిలువ శుద్ధరూపు బట్ట
మాటు వేసి యున్న మానవుండు గిట్టు
బాట చెప్ప కున్న బైట పడుట యెట్టు. ॥సూర్య॥

వేదమంత్రపూజ వేదమంత్రఘోష
పాదపద్మ మంద భక్తహృదయభాష
వేది వయితి వయ్య వినతపుత్ర పోష
సాదు కావ వయ్య స్వామి వేంకటేశ! ॥సూర్య॥

పాథోధి బుట్టిన పద్మావతీ స్వామి
రాధాకృష్ణుణ్ణి రసరాజ ప్రోవరా! ॥సూర్య॥

(39)

అన్నమయ్య విన్నపాలు విన్న వేంకటేశ్వర నన్ను చూడవ?.

దానధర్మము లడుగని మానవంతుడను. మరణించక ముందే దయచూపుము. అన్నమయ్య పాటి కాకున్న చులకనతో చూడక నా కృతులు విని మన్నింపుము. నిన్ను గాంచని నియమములు వ్యర్థములు. ఎన్ని యాపదలు వచ్చిన మీ దాసుణ్ణే శ్రీనివాస.

కోపము తెలియని కూరిమే నీవు. రాధాకృష్ణుణ్ణి గైకొనుము స్వామి!

పల్లవి॥ అన్నమయ్య నిన్ను నార్తితోడ గొలువ
విన్నపాలు విన్న వేంకటేశ కనవ. ॥అన్న॥

చరణాలు॥ దాన మడుగ లేదు ధర్మ మడుగ లేదు
దీన జన్మకాదు తిండి కొఱకు గాదు
మాన మున్నవాణ్ణి మరలిపోవు వాణ్ణి
కాన కేగు మునుపె కరుణజూపు స్వామి. ॥అన్న॥

అన్నమయ్యపాటి యాదరించ లేవ?
చిన్నమయ్య యనుచు జీదరించు కొనక
విన్న వించి నట్టి వివిధ కృతుల వినుచు
మన్న నీయ వయ్య మాధ వయ్య నాకు. ॥అన్న॥

నిన్ను బొంద లేని నియతి వ్యర్థ మయ్య
కన్నుగాన నట్టి కామాంధు గానయ్య
మిన్ను విఱిగి పడ్డ మీపాద దాసుణ్ణి
చిన్నె లెన్న నయ్య శ్రీశ్రీనివాస! ॥అన్న॥

క్రోధమే యెఱుగని కూరిమే నీవయ్య
రాధాకృష్ణుణ్ణి రసరాజ బ్రోవరా! ॥అన్న॥

(40)

శ్రీనివాస! కొండకోనల్లో నెచ్చట యున్న మాగుండెల్లో వసించు కోనేటి రాయడవు నీవు.

నీ వేవాహనముల నెక్కిన నేయాభరణముల ధరించినా మేళతాళములతో నూరేగినా దారిద్ర్యమును బోగొట్టి మోక్షమిమ్ము. నీవు ఎక్కడున్నా యారాధింతును. ధర్మము విడువను. వరద! నీకై యెన్ని బరువు లైనా మోయుదును.

ప్రతి హృదయమునందు నీ చరిత చాటు రాధాకృష్ణకవిని చేకొనుము

పల్లవి॥ కొండల్లో కూర్చున్న కోనల్లో దాగిన
గుండెల్లో దాగున్న కోనేటి రాయడ! ॥కొండల్లో॥

చరణాలు॥ వాహనా లెక్కినా వజ్ర భూషలు దాల్చినా
కాహళులు పట్టినా గజములు నడచినా
మోహమ్ము భేదించి మోక్షమ్ము దరి జేర్చి
దాహమ్ము పోకార్చి దారిద్ర్య మణపరా! ॥కొండల్లో॥

ఎక్కడ దాగినా యేలోక మేగినా
చిక్క నని యన్నా చక్క నయ్య నిన్ను
మొక్కు చుందు నన్నా మోహి నౌదు నన్న
దక్క వంచు విన్నా ధర్మపథము వీడ. ॥కొండల్లో॥

దొరవు నీవె యనుచు దోషి నైన నేను
మురజరవములోన మునుగ నయ్య నెపుడు
భరము లెన్ని యయిన భార మనక మ్రోతు
వరద వచ్చి నన్ను వనట దీర్చు సామి. ॥కొండల్లో॥

వీధి వీధియందు వేంకటేశు గొలుచు
రాధాకృష్ణణ్ణి రసరాజ బ్రోవరా! ॥కొండల్లో॥

(41)

పద్మావతి తనువు గగుర్పాటు చెంది ముంగురులు నుదుట ముసురు కొన్నవి.

ఆనంద సముద్రంలో నా దంపతులు మునిగినారు. వనములలో నాట పాటలతో దినముల నెరుగక గడపినారు. మాయామర్మము లెఱుగక వారు సంచరించిరి. దేవతలు మానవులు మునులు పుష్పవర్షము కురిపించినా రాదంపతుల మీద.

ఆ మధురానురాగ మూర్తులు రాధాకృష్ణ కవిని చెంతకు చేర్చుకొనరా?

పల్లవి॥ పులకలు నలమెను బొలుపగు పద్మకు
అలకలు విరిసెను నలికము నలరగ. ॥పులకలు॥

చరణాలు॥ వెలిగెను గన్నులు పెరిగెను మమతలు
పిలచెను వింతగ ప్రేమలు కలియగ
వలపుల నెరిగిన స్వామియు మురిసెను
విలసిత ముఖముల వెలసిరి దంపతులు. ॥పులకలు॥

వనముల దిరిగిరి పాడిరి యాడిరి
దినములు తెలియక తిరుమల నగముల
మనములు పొంగగ మాయలు తెలియక
మినమిన లాడుచు మెలగిరి దంపతులు. ॥పులకలు॥

దివినుండి కుసుమాలు దేవతలు కురిపింప
భువినుండి మానవులు పుష్పాలు వర్షింప
మవునము పాటించు మౌనులు తపసులు
కవియగ మురిసిరి కళ్యాణ దంపతులు. ॥పులకలు॥

మాధుర్య మతులైన మహనీయ మూర్తులు
రాధాకృష్ణుణ్ణి రసరాజులై ప్రోవరా! ॥పులకలు॥

(42)

ఎక్కడెక్కడో వెదకిన వేదాంతము లభించదు. తిరుమలేశ్వరుని సేవించుటే వేదాంతము.

పంచభూతములు దశేంద్రియములు త్రిగుణములు కామారి వర్గము జీవులను మాయలో బడద్రోయును. భక్తిజ్ఞానకర్మల బాటించక ముక్తిమార్గ మెచ్చటని రక్తిలో మునిగి జనార్దను శక్తి యెరుగరు. ఇరువది నాలుగు తత్త్వముల కవ్వల నుండు వాడే భగవానుడు అదియే యిరువదియైదవ తత్త్వము చిచ్ఛక్తి. అతడే శ్రీనివాసుడు.

సర్వాతీత మగు నా శక్తే యా శ్రీపతే రాధాకృష్ణుణ్ణి రక్షించు వాడు జగద్రక్షకుడు

పల్లవి॥ వేదాంతం బనిన వెదకిన దొరకదు
వేదాంతం బనిన వేంకటేశు గొలుచుటే. ॥వేదాం॥

చరణాలు॥ భూతపంచకమ్ము పుణ్యాత్ము నీయవు
పూతేంద్రియదశకము పూతాత్ము నొసగవు
జాత మైన త్రిగుణాలు జన్మకు మూలమవు
గోతిలో బడద్రోయు కూర్ములే కర్మాదులు. ॥వేదాం॥

భక్తిజ్ఞానకర్మలు పాటించ జాలరు
ముక్తిమార్గ మేదని మురుగున నుందురు
రక్తిలోన మునిగి రగులుచు గుందుదురు
శక్తి నెఱుగ లేరు జనార్దను నెఱుగరు. ॥వేదాం॥

చతుర్వింశతి తత్త్వముల జరియించు తత్త్వమ్ము
పతిదేవుని దైన పరమాత్మ తత్త్వమ్ము
అతివేలమౌ యిరువది యైదవ తత్త్వమ్ము
అతడే శ్రీనివాసుడు అదియే యానంద తత్త్వమ్ము.॥వేదాం॥

భేదాలు లేని యా వేంకటపతియే
రాధాకృష్ణుణ్ణి రసరాజై ప్రోవడా! ॥వేదాం॥

(43)

**శరణాగతివలన సమస్త పాపములు నశించి శాంతి చేకూరును.**

విభీషణుడు సుగ్రీవుడు హనుమానుడు మున్నగువారు శరణాగతితో ధన్యులైనారు. రంతిదేవుడు శ్రీహరి సేవలో జన్మ ధన్యము చేసికొన్నాడు. నిత్యము శ్రీ వేంకటేశ్వరు సేవలో గడిపినవాడు శరణాగతి యయినవాడు సమస్త సంపదలు పొందగలడు.

మాధవు సేవలో గడిపిన రక్షించు శ్రీనివాసుడు రాధాకృష్ణకవిని రక్షించదా?

పల్లవి॥ శరణాగతియే శాంతికి మూలము
శరణాగతియే సర్వాఘ హరము. ॥శరణా॥

చరణాలు॥ శరణని పదపడి శాంతించె విభీషణుడు
శరణని మిత్రుడై శాంతించె సుగ్రీవుడు
శరణని దాసుడై శాంతించె హనుమానుడు
శరణనె ప్రహ్లాదుడు శాంతించె నరసింహుడు. ॥శరణా॥

తనుమన ధనముల ధర్మము తప్పక
ఘనమను కొనక నిర్గతధను డయి
కనికని వనముల గడుపు మాడినను
మనమున గొలిచెను మాధవు రంతిదేవుడు. ॥శరణా॥

వినయము తోడుత వేంకటేశు గొలువ
అనయము తోడయి యాపద లడచును
తనయుల వ్యధలను దనవిగ దలచుచు
మునుకొని యుండును ముదమును నిచ్చును. ॥శరణా॥

మాధవుసేవలో మసలిన గాచును
రాధాకృష్ణుణ్ణి మఱచున రసరాజు ప్రోవదా! ॥శరణా॥

(44)

మణిదీపసమతేజస్సు గలవాడ వైన గోవింద మా కానందము గూర్చువాడ వైతివి.

నిన్ను గాంచుటకు నెన్నియో మెట్లెక్కవలెను. అందుకై నేను నాత్మలో నీ కోవెలను గట్టుకొంటిని. నిన్ను గూర్చి గానము చేసిచేసి వాడిపోతిని. నీ స్తోత్రము ఎప్పుడు చేయవలెను. ఏకాంతమున కాంతతో నేవేళ నుందువో పిలచిన నేమందువో? సర్వము నీవని నీ పాదాలే సర్వసంపద లనుకొంటిని.

నాదము రాగము నీవు. ప్రేమరూపుడ వైన నీవు రాధాకృష్ణుణ్ణి కాపాడవా? గోవింద!.

పల్లవి॥ గోవింద గోపాల గోలోక వాసా
మా విందు వైతివే మణిదీపతేజా! ॥గోవింద॥

చరణాలు॥ ఏడుకొండలపైకి యెన్ని మెట్లెక్కాలి
చూడ లేనుర నిన్ను చూపు దూర మయ్యింది
గూడులో గట్టిన గుడిలోనె యున్నావు
పాడిపాడి గొంతు వాడిపోయెను సామి! ॥గోవింద॥

ఏ వేళలో నిన్ను నింపార కొలవాలి
ఏ వేళ నీపైన నింపుగా బాడాలి
ఏ వేళ పద్మతో నేకాంత మందుందు
ఏవేళ పిలచినా యేమందువో సామి! ॥గోవింద॥

మాస్వామి నీవంచు మా పతివి నీవంచు
మా స్వామి సేవలో మైమరతు నేనంచు
శ్రీస్వామి శ్రీనివాస శ్రీలేల నా కంచు
శ్రీస్వామి పాదాలె శ్రీలని నేనందు. ॥గోవింద॥

నాదాల రాగాల నాథుడ వీవయ్య
రాధాకృష్ణుణ్ణి రసరాజ ప్రోవరా! ॥గోవింద॥

బంగారు రథము మీద శ్రీనివాసున కిరువంకల పద్మావతి యలమేలు మంగలు కొలువుతీరి వెలుగుచున్నారు

శ్రీనివాస! నీ సేవలో నర్చకులు భక్తులు పాడుపాటలు, సంకీర్తనలు, భజనలతో తిరుమల ప్రతిధ్వనిస్తూంది. వేదశాంతిమంత్ర పాఠములు మార్మోగుచుండ నూరేగి నారాదంపతులు

వేద మంత్రములలో వెలుగొందు వారు రాధాకృష్ణుణ్ణి కాపాడరా!

పల్లవి॥ మహారథముపై మాధవి యొకవంక
మహారథముపై మానిని నలమేలొకవంక. ॥మహా॥

చరణాలు॥ తిరుచూర్ణ మలదిన తిరునంబు లొకవంక
తిరుపుష్పసేవలో తిరుభక్తు లొకవంక
తిరునాధుగానాలు తిరునామ మొకవంక
తిరురాజ దాసులే తిరుమల యకలంక. ॥మహా॥

శ్రీపతి శ్రీనాధ శ్రీధామ శ్రీవేద
శ్రీపధ శ్రీసత్య శ్రీధర్మ శ్రీకర
శ్రీపర శ్రీవర శ్రీధర శ్రీనామ
శ్రీపుర శ్రీహిత శ్రీజన శ్రీచర! ॥మహా॥




"శంనో మిత్రః శంనో విష్ణుః
శంనో భవత్యర్యమా శంన ఇంద్రో బృహస్పతిః
శంనో మరుతః శంనో దేవాః
శంనో సర్వే" యనుచు శాంతితో దిరిగిరి. ॥మహా॥

వేదమంత్రాలలో వెలుగొందు వారలు
రాధాకృష్ణుణ్ణి రసరాజులై బ్రోవరా! ॥మహా॥

[illegible]



## వరకుదురు రాధాకృష్ణకవి

తల్లిదండ్రులు : [illegible]

జన్మస్థానము : జమీగొల్వేపల్లి, పామర్రు (మండలం) కృష్ణాజిల్లా

జననము : ది. 4-8-1938

విద్యాభ్యాసము : (1) తండ్రిదగ్గర అమరకోశము, వేదమంత్రములు, వాస్తువిద్యలు
(2) స్వగ్రామములోని ప్రాథమిక పాఠశాలలో విద్యాభ్యాసం
(3) కీ॥శే॥ పొట్లూరి వేంకటాచలపతిరావుకవిగారి దగ్గర సంస్కృతభాషా సాహిత్యములు
(4) కీ॥శే॥ కాట్రగడ్డ వేంకటసుబ్బయ్యగారి దగ్గర హిందీభాష

ఉన్నత విద్య : శ్రీ భావనారాయణస్వామివారి సంస్కృత పాఠశాల పొన్నూరు లో సంస్కృతాంధ్రములు, భాషాప్రవీణ - ఆంధ్ర యూనివర్శిటీ
P.O.L. ఆంధ్ర యూనివర్శిటీ, ఎం.ఎ. - ఆంధ్ర యూనివర్శిటి

వృత్తి : తెలుగు ఉపాధ్యాయునిగ (జిల్లా ప్రజా పరిషత్ - గుంటూరు)

ముద్రిత రచనలు : పద్య కావ్యములు
1) కాహళి 2) కృష్ణగీతాలు 3) మారుతీ మైథిలీశ
4) శాంతి శిల్పము (ప్రబంధం)
5) వంశీస్వరాలు 1,2 భాగములు (సంకీర్తనలు)

అముద్రితములు : 6) డమరుకం (వచన కవిత) 7) రసభారతి (ఖండ కావ్యం)
8) శివతాండవమ్ (సంస్కృతం) 9) తొక్కబడ్డపువ్వులు (వచన కవిత)

నిత్యకృత్యములు : సాహిత్యారాధన, భారతీయ సంస్కృతి ప్రచారం
సాహిత్య, రేడియో, ధార్మిక ప్రసంగములు, సత్సంగములు,
కవితా వ్యాసంగము